Gōpālakṛṣṇayyasidthānti,

Rāḷlabhaṇḍi

Gaṇakarañjani

Madarāsu, 1912

Record no. 536

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

గోపాలకృష్ణయ్యసిద్ధాంతి, రాళ్లభండి.

గణకరంజని / రాళ్లభండి గోపాలకృష్ణయ్యసిద్ధాంతిగారిచే రచింపబడినది.- 1. కూర్పు.- మదరాసు : శ్యామరాజముద్రాక్షరశాల, 1912.

140 p. ;22 cm.

Record no. 536

Gōpālakṛṣṇayyasidthānti, Rāḷlabhaṇḍi.

Gaṇakarañjani / Rāḷlabhaṇḍi Gōpālakṛṣṇayyasidthāntigāricē racimpabaḍinadi.- 1. kūrpu.- Madarāsu : Śyāmarājamudrākṣaraśāla, 1912.

140 p. ;22 cm.

Record no. 536

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB     Date filming began:



శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణేనమః

జ్యోతిశ్శాస్త్రవేత్తలకును, నూతనాభ్యాసకులకును,
అత్యంతోపయుక్తంబగునటుల
సిద్ధాంతశాస్త్రానుసారసంగ్రహంబుగా
నావల్లరచియింపఁబడిన

# గణకరంజని

ఈగ్రంథము,

బ్రహ్మశ్రీ మక్కపాటి- వెంకటరమణయ్యసిద్ధాంతి,
సుబ్బరాయ సిద్ధాంతిగార్ల ప్రియశిష్యులగు,
వంగవోలు తా॥ తమ్మవరం కాపరస్థులు
బ్రహ్మశ్రీ రాళ్లభండి-గోపాలకృష్ణయ్యసిద్ధాంతి గారిచేరచింపబడి

యం. వెంకటాచల మొదలియారిచే.
శ్యామరాజముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రకటింపఁబడియె.



మొదటి కూర్పు ప్రతులు ౧౫౦౦

మదరాసు ౧౯౧౭.



వెల ౧-౦-౦.



శ్రీరస్తు.

శ్రీరామజయం.

# గణకరంజని.



శ్లో॥ శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణంచతుర్భుజం।
ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥
జయతిజగతఃప్రసూతిర్విశ్వాత్మా సహజభూషణంనభసః।
ధృతకనకసదృశదశశత మయూఖమాలార్చితస్సవితా॥ ౧॥
ప్రథమమునికథితమవితథ మవలోక్య గ్రంథవిస్తరస్యార్థం।
నాతిలఘువిపులరచనా హ్యాతిరుచిరా స్పష్టమభిధాతుం॥ ౨॥

## గురువందనం.

శ్లో॥ వందేనిరంతరమహం మక్కపాటికులాగ్రణేః।
వేంకట్రమణసిద్ధాంతేః దైవజ్ఞస్యపదద్వయం॥

## గ్రంథకర్తృవంశావళిః.

శ్లో॥ శ్రీమత్తమ్మవరాఖ్యాన నగరేనివసన్సదా।
శ్రీరామచంద్రపాదార విందభ్రమరతుల్యకః॥
శిలాశకటవంశాబ్ధౌ జ్యోతిశ్శాస్త్రనిధిర్విధుః।
రామాంబాకుప్పయ్యనామ్నోఃపి ప్రోస్సేవాపరాయణః॥

శ్లో॥ శ్రీరాజలక్ష్మీవిద్యాత్తస్వాచ్ఛాన్తైకవిచారణః।
గోపాలకృష్ణనామాసౌ జాతోవిద్వన్మనోహరః॥
సూర్యసిద్ధాంతపదకాన్యాలోక్యైవ ముహుర్ముహుః।
బాలానాంసుఖబోధాయా కరోద్గణకరంజనీం॥

శకసాధనం.

శ్లో॥ షష్టి౬౦త్రియమైః౨౩గుణితం వ్యపగతసంవత్సరేణసమ్మిశ్రం।
నవగగనాబ్ధి ౪౦౯సమేతం శకనృపకాలం విజానియాత్॥

తా॥ ౬౦ పెట్టుకొని ౨౩ టగుణించి ప్రభవాదిగత సంవత్సరములసంఖ్యను ౪౦౯టిని కలియకూడితే శకకాలమవును.

కలిగతాబ్దధ్రువానయనము.

శ్లో॥ అశీతి౮౦షష్టి౬౦గుణితాః గజోర్విప౧౬౮సమన్వితాః।
ప్రభవాద్యబ్దసంయుక్తాః భవేయుఃకలివత్సరాః॥

తా॥ అశీతి ౮౦పెట్టుకొని ౬౦టగుణించి ౧౬౮నికూడి ప్రభవాదిగతసంవత్సరాలనుకూడితేను కల్యాది గతాబ్దములగును॥

కరణాబ్దసాధనం॥

శ్లో॥ అంకాద్రీందుగుణైః ౩౧౭౯హీనం శకాబ్దమితికథ్యతే।
గజవేదశరాంభోధి ౪౫౪౮హీనం తత్కరణాబ్దకం॥

తా॥ కల్యాదిగతాబ్దములలో ౩౧౭౯తీసినశాలివాహనశకమగును. ఆకల్యాదిగతాబ్దములలో ౪౫౪౮ తీయబడినశేషముకరణాబ్దములగును. వీటినేధ్రువాబ్దములని యెరుంగవలయును.

సావనద్యుగుణానయనము.

శ్లో॥ ధ్రువాబ్దోర్క౧౨గుణో మాసయుక్తస్త్రిస్థో రసా౬బ్ధిరయుక్
శూన్యాద్రి ౭౦ లబ్ధమనుయుక్సుర ౩౩లబ్ధోధిమాసయుక్॥



ఖత్రి ౩౦ఘ్నస్తిథియుక్తోథరుద్ర ౧౧ఘ్నం వహ్నిఖాద్రిభిః
౭౦౩। లబ్ధక్షయవిశోధ్యశ్చేత్ శుక్రవారాదికందినం। వర్జ్యే
ద్వర్గయేదేకం వారోనాయాతిచేత్తదా॥

తా॥ ధ్రువాబ్దములను ౧౨టగుణించి ఇష్టమాసపర్యంతం గతమాసములుకూడి మూడుప్రతులుగా పెట్టుకొని కిందిప్రతిలో ౪౬కూడి ౭౦ట భాగించగా వచ్చినలబ్ధము ౧౪న్ను రెండవపైప్రతిలోకూడి ౩౩టపాలుగొనగా వచ్చినలబ్ధము అధిమాసములు. ఆఅధిమాసములను మొదటిప్రతిలోకూడి ౩౦టగుణించి గతతిథులు కూడి దానిని రెండుప్రతులుగావుంచి కిందిప్రతిని ౧౧టగుణించి ౭౦౩టభాగించగా వచ్చినలబ్ధము క్షయతిథులు. ఆక్షయతిథులు పై ప్రతిలోతీశివేశిన శుక్రవారాదిసావన ద్యుగణమగును. ఈఅహర్గణమును ౭టభాగించగా మిగిలినశేషము శుక్రవారాదిగా వారమగును. వారము సరిపోనియెడల ద్యుగణములో వకటి కూర్చిననను లేక ఒకటినిశోధించియైనను వారమును సరిచేసికొనవలయును.

ఒకానొకసమయమందు ద్యుగణమందు రెండు కూర్చటముకాని రెండు తోసివెయ్యటముకాని సంభవించును. గనుక తెలియును.

శ్లో॥ అధిమాసాత్పూర్వమాసే అధిమాసేతథైవచ।
లబ్ధాధిమాసేచైకోనం సంయుక్తం పరరాశిగే॥

తా॥ అధిమాసముకంటే పూర్వమాసమందుకాని అధిమాసమందుకాని వర్తమాన అధిమాససంఖ్య యెక్కువైనయెడల అధిమాససంఖ్యయందు ఒకటితీశివేశి పూర్వోక్తప్రకారము అహర్గణము సాధించేది.

మధ్యగ్రహసాధనం.

సూర్యస్య.

శ్లో॥ ద్యుగణేద్విస్థేవిశ్వ౧౩ఘ్నో గుణాభ్రనవ(౯౦౩)భాజితః।
భాగాదిద్యుగణేశోధ్యః శుక్రక్షా మధ్యమోరవిః॥
శర్వభూపాద్వ్యక్షగుణాః౧౧-౧౬-౫౨-౩౮వేఃపూర్వధ్రువో
భవేత్। త్రిగుణాబ్ధాబ్ధితిథ్యాప్తా లిప్తాశోధ్యారవిభవేత్।
గత్యధ్వయోజనాహన్యే ద్విలిప్తాఖాష్ట౮౦హృత్యజేత్॥

తా॥ ద్యుగణము రెండుప్రతులుగావుంచి, క్రిందిప్రతిని౧౩టగుణించి ౯౦౩ టభాగించగా వచ్చినభాగాదిని పైద్యుగణములో శోధిస్తేను భాగాదిసూర్యుడున్ను బుధశుక్రులౌదురు, పూర్వధ్రువాలు ౧౧-౧౬-౫౨-౩ కూడేది కరణాబ్దాలు ౩ట గుణించి ౧౫౪టభాగించగా వచ్చినలిప్తాది తీసివేసేది. గతిని ౪౦టగుణించి ౮౦టి భాగించగా వచ్చినవిలిప్తలుశోధిస్తేను మధ్యసూర్యుడగును.

## చంద్రస్య.

శ్లో॥ విశ్వ౧౩ఘ్నో ద్యుగుణో ద్విస్థః వేదాచల౭౪హృతాంశఫలం।
భాగాదియుక్తద్యుగుణో శైలాద్రియుగరూప౧౪౭౭హృత్।
అంశాదియుక్సదామధ్య చంద్రోభవతిసర్వదా। రుద్రాష్టాం
గార్ణవసురాః ౧౧-౮-౪౬-౩౩ పూర్వధ్రువయుతస్సదా।
త్రిగుణాబ్దా వేద౪భక్తా విలిప్తాశ్శోధితేశశీ।
గత్యధ్వయోజనాహన్యే ఖాష్ట౮౦హృద్వికలోనితాః॥

తా॥ ద్యుగణమును ౧౩టగుణించి రెండుప్రతులుగావుంచి క్రిందిప్రతి ౭౪ట భాగించగా రాబడిన భాగాదిన్ని ద్యుగణమును ౧౪౭౭ట భాగించగా రాబడిన భాగాదినిన్ని ౧౩టగుణించిన ద్యుగుణములో కూడితేను అంశాదిగా చంద్రుడగును. పూర్వధ్రువము ౧౧-౮-౪౬-౩౩ కూడేది కరణాబ్దాలు ౩టగుణించి ౪టభాగించగా రాబడినవి లిప్తలుశోధించేది చంద్రునిమధ్యగతి యీదేశముకు అధ్వయోజనాలు ౫౧గనుక ౪౦టగుణించి ౮౦టభాగించగా రాబడినలిప్తలు తీసివేసితే మధ్య చంద్రుడగును.

## చంద్రోచ్చకు.

శ్లో॥ నందైకుతర్కై౯౬౧ద్యుగుణాదవాప్తంభాగాదిలిప్తాదిఫలైక్యముచ్చం। పూర్వధ్రువాద్విన్యస్తేందు తారార్కా ౨-౧౭-
౨౭-౧౨ యుక్సధాబుధైః। త్రిగుణాబ్దారసాంకా ౯౬ ప్తా
లిప్తాశోధ్యాచ్చలోచ్చకం। గత్యధ్వయోజనాహన్యే విలిప్తా
ఖాష్టహృత్త్యజేత్॥



తా॥ ద్యుగుణమును రెండుప్రతులుగా ఉంచుకొని మొదటిప్రతి ౯టభాగించినభాగాదినిన్ని కిందిప్రతి ౬౧భాగించిన లిప్తాదినిన్ని కూడితేను భాగాది చంద్రోచ్చ యగును పూర్వధ్రువము ౨-౧౭-౨౭-౧౨ కూడేది. త్రిగుణాబ్దాలు ౯౬టిచేత భాగించగా వచ్చినలిప్తవిలిప్తలు శోధించేది.

## రాహువునకు.

శ్లో॥ త్రినిఘ్నా౩ద్యుపిండా ద్విధాలిప్తికాద్యాః।
యుతాబ్ధీశతా ౧౦౧౪ ప్తాస్తమస్యాంశకాద్యాః॥

శ్లో॥ గగనాక్షిఖరామాశ్చ విలిప్తాఃపుష్కరాంకితాః ౦-౨-౩౦-౦
స్వధ్రువేణవియుక్తోసౌ మధ్యరాహుస్ఫుటోభవేత్।
త్రిగుణాబ్దాఃఖాబ్ధితత్త్వా౨౫౪౦హృతాభాగాదియోజయేత్।
గత్యధ్వయోజనాహన్యే విలిప్తాఖాష్ట౮౦హృత్త్యజేత్॥
కల్యబ్దాషష్టికృత్యూనా శ్శేషాంనక్షత్ర సంగుణాత్।
ఖపంచదస్త్రై౨౫౦రాప్తోనా లిప్తాద్యంతుతమోభవేత్॥

తా॥ ద్యుగుణమును ౩టగుణించి రెండుప్రతులుగావుంచి మొదటిప్రతిలిప్తాదినిన్ని రెండోప్రతి ౧౦౧౪ట భాగించగా రాబడిన భాగాదినిన్ని కూడితేను రాహువగును. పూర్వధ్రువము ౦-౨-౩౦-౦లో శోధించేది త్రిగుణాబ్దాలు ౨౫౪౦టిచాత భాగించగా వచ్చిన భాగాదికూడేది దేశాంతరసంస్కారసంస్కారంచేసేది. కల్యాద్యబ్దాలు ౩౬౦౦ట్లో శోధించి శేషము ౨౭ట గుణించి ౨౫౦టిచాత భాగించగా వచ్చినవి విలిప్తలను శోధిస్తేను రాహువగును.

## కుజసాధనం.

శ్లో॥ ద్యుపిండోక్షి౨భక్తోద్విధా చంద్రనేత్రా ౨౧ భ్రవేదా౪౦ప్త
భాగాదిలిప్తాదియుక్తఃద్యుపిండార్ధపవాంశకాద్యఃకుజస్స్యాత్
వ్యోమార్కనఖషడ్వేదాః కుజస్యాయంధ్రువస్సదా ౦-౧౨-
౨౦-౪౬। త్రిగుణాబ్దాఃఖ బాణాగ్నిశరై౫౩౫౦ భాగాది

ద్యుహృద్యుతే। గత్యధ్వయోజనాహన్యే విలిప్తాః ఖాష్టరాంహృ త్యజేత్ । కల్యబ్దోనాష్టష్టికృత్యా ౩౬౦౦ శేషామనుహ తా౧౪ హృతాః । తత్వేందవో కృతాలిప్తా ప్రయోజ్యం మధ్యమోకుజః॥

తా॥ ద్యుగుణము ౨౮భాగించి రెండు ప్రతులుగావుంచి రెండోప్రతి ౪౦ టభాగించిన లిప్తాదినిన్ని పైప్రతి ౨౮ట భాగించిన భాగాదినిన్ని ౨౮ట భాగించిన ద్యుగుణములోకూడితేను కుజుడగును. పూర్వధ్రువము ౦-౧౨-౨౦-౪౬ కూడేది. కరణాబ్దాలు ౩టగుణించి ౫౩౦ట భాగించిన భాగాదికూడేది. మధ్యగతి ౪౦ట గుణించి ౮౦టభాగించగా రాబడినవిలిప్తలు శోధించేది.

కల్యాదిగతాబ్దాలలో ౩౬౦౦తీసి ౧౪టగుణించి ౧౨౫ట భాగించిన లిప్తాది కూడితే దృక్సంస్కారమధ్య కుజుడగును.

బుధసాధనం.

శ్లో॥ ద్యుపిండశ్చతురఘ్నో లవాదిః ద్యుపిండాద్రసఘ్నాచ్చ రర్త్వా ౬౫ హృతాశ్చైంసామ్యః॥ బుధస్యతు గిరీంద్వర్క నిగ మాబ్ధియపేవచ ౭-౧-౧౭-౪౪ త్రిగుణాబ్దాష్టనాగాద్రి ౭౮౮ భక్తాభాగాది యుగ్బుధైః॥ గత్యధ్వయోజనాహన్యే విలిప్తా ఖాష్ట హృత్యజేత్ ॥

తా॥ ద్యుగుణము నాలుగింట గుణించిన భాగాదినిన్ని ద్యుగుణమును ౬చే గుణించి ౬౫టభాగించిన భాగాదినిన్ని కూడితేను బుధుడగును. పూర్వధ్రువము ౭-౧-౧౭-౪౪కూడేది త్రిగుణాబ్దాలు ౭౮౮ట భాగించిన భాగాదికూడేదిగతి సంస్కారంచేసేది.

గురుసాధనం.

శ్లో॥ ద్యుపిండోశర౫ఘ్నో కలాద్యం గురుస్యాద్ద్యు పిండాత్ఖ శైలా ౭౦ ప్తలిప్తైవిహీనః। గురోఃపంచాష్ట తర్కేందునఖాః



౫-౮-౧౬-౨౦ పూర్వధ్రువోభవేత్ । త్రిగుణాబ్దాభ్ధర్క ౧౨౪ భక్తాలిప్తాయోజ్యం గురోఃసదా । గత్యధ్వయోజ నాహన్యే విలిప్తాః ఖాష్టరాం హృత్యజేత్ । కల్యాద్యబ్దానా షష్టికృత్యా ౩౬౦౦ శేషారైకాః ౧౨నిఘ్న భాజితాః। పం చారైకాః ౧౨౫ లిప్తదృక్కర్మ శోధ్యావాచస్పతిభవేత్ ॥

తా॥ దుగణము ౫టగుణించిన లిప్తాదినిన్ని ద్యుగుణమును ౭౦ట భాగించగా వచ్చినలిప్తాదినితీసివేస్తేను లిప్తాది బృహస్పతియగును. పూర్వధ్రువము ౫-౮-౧౬-౨౦కూడేది. త్రిగుణాబ్దాలు ౧౨౪టభాగించిన లిప్తవిలిప్తలుకూడేది. దేశాంతరసంస్కారంచేసేది. కలిగతాబ్దాలలో ౩౬౦౦తీసిన శేషమును ౧౨టగుణించి ౧౨౫ట భాగించగా వచ్చినలిప్తాదితీస్తేను బృహస్పతియగును.

శుక్రసాధనం.

శ్లో॥ ద్యుపిండోష్టరా గుణోర్యద్విధా చేంద్రిజ్ఞయంచ ద్విషష్ఠా ౬౨ ప్తభాగాదిలిప్తాదియుక్సః । కవేఃపూర్వధ్రువయుతారుద్రాం కానవమూర్ఘనాః ౧౧-౯-౯-౨౧ త్రిగుణాబ్దాగ్నివ స్వం కశశాంకైర్భాజితంఫలం । అంశాదికంవిపిహీనంతుకుర్యా ద్దే శాంతరంహితత్ । కల్యబ్దాన్యానా షష్టికృత్యో౩౬౦౦ చ్ఛే షాన్నేత్రాబ్ధిర౨నిఘ్నకృత్ । పంచారాకా౧౨౫ప్తాశులిప్తా ది శోధ్యాభృగ్వాశు శ్రీఘ్రుకం॥

తా॥ ద్యుగుణమును ౮టగుణించి రెండు ప్రతులుగావుంచి మొదటిప్రతిని ౫ట నాగించినభాగాదినిన్ని క్రిందిప్రతి౬౨భాగించిన లిప్తాదినిన్ని కూడినశుక్రుడగును పూర్వధ్రువము ౧౧-౯-౯-౨౧కూడేది త్రిగుణాబ్దములను ౧౯౮౩ట భాగించిన భాగాదితీశేది. దేశాంతరసంస్కారంచేశేది కల్యాద్యబ్దాలలో ౩౬౦౦తీసి ౪౨గట గుణించి ౧౨౫ట భాగించిన లిప్తాదితీసివేస్తేను శుక్రశ్రీఘ్రుమగును.

శనిసాధనం.

శ్లో॥ ద్వి౨నిఘ్నాద్యుపిండా త్కలాద్యంశనిస్స్యత్ ।
ద్యుపిండాప్తతిథ్యా ౧౫లప్త యుక్తాత్కలాద్యం॥

శ్లో॥ గుణాష్టీందు నవాంబోధిర్రసర్రామా ౩-౧౮-౪౯-౩౬ స్తత
శ్శనైః। త్రిగుణాబ్దాఃఖనాగాక్షి ౨౮౦హృతా లిప్తాదియుక్
శనిః। గత్యధ్వయోజనాహన్యే విలిప్తాఖాష్ట ౮౦ హృత్య
జేత్ । కల్యాబ్దాషష్టిక్రృత్యోనా ౩౬౦౦ చ్ఛేషంరసకరైః ౨౬
హృతః। పంచాకార్ణవ్హా ౧౨౫కలాద్యుక్తా రాశ్యాదిశ్శని
రీరితః॥

తా॥ ద్యుగుణమును ౨ట గుణించిన లిప్తాదినిన్ని ద్యుగుణము ౧౫౮ట భాగించినలిప్తాదినిన్ని కూడితేను లిప్తాదిశనియగును. పూర్వధ్రువము ౩-౧౮-౪౯-౩౬ కూడేది త్రిగుణాబ్దాలు ౨౮౦ట భాగించగా రాబడిన లిప్తవిలిప్తలు కూడేది. దేశాంతర సంస్కారంచేశేది. కల్యాద్యబ్దాలలో ౩౬౦౦ తీశివేశి శేషము ౨౬ట గుణించి౧౨౫ భాగాహరించగా వచ్చినలిప్తవిలిప్తలు కూడితేను మధ్యశనియగును.

## సంస్కారనిర్ణయః.

శ్లో॥ కర్తవ్యాఃపంచసంస్కారాః మధ్యఖేటేషుసర్వదా ।
పూర్వధ్రువఃప్రథమతః త్రిగుణాబ్దమతఃపరం ।
దేశాంతరం బీజఫలంబాహూః ఫలమితిక్రమాత్ ॥

తా॥ మధ్యగ్రహమందు ౫సంస్కారములు చాయతగినది.

(౧) పూర్వధృవం (౨) త్రిగుణాబ్దం (౩) దేశాంతరం (౪) దృక్సంస్కారం (౫) భుజాఫలసంస్కారంబు.

శ్లో॥ చంద్రోచ్చస్యతదారాహూో చంద్రార్కగ్రహణాదిషు ।
ఆవస్యకత్వాత్కర్తవ్యం నతిధ్యానయనాదిషు॥ అనేన్యాయం॥

## ౫. భుజాఫలసంస్కారః.

శ్లో॥ పంచతుర్రామైః ౩౬౫ మునినేత్ర ౨౭ యోశ్చశైలాష్టకైః
శ్చ ౬౮౭ గజాష్టబిశ్చ ౮౮ దంతాగ్నివేదైః ౪౩౩౨ కృతనేత్రబా
హుభిః ౨౨౪ రసతుర్గలాశైః భ్రుకుభిః ౧౦౭౬౬ క్రమేణ॥



శ్లో॥ సూర్యబాహుఫలంసర్వం గ్రహాణాంహారకైఃపృథక్ ।
విభజ్యలబ్ధంలిప్తాది కూర్యాత్సూర్య స్ఫుటోక్తవత్ ॥

తా॥ సూర్యునకు ౩౬౫ట చంద్రునకు ౨౭ట కుజునకు ౬౮౭ట బుధునకు ౮౮ట గురునకు ౪౩౩౨ట శుక్రునకు ౨౨౪ట శనికి ౧౦౭౬౬టను సూర్యునిభుజాఫలమును భాగించగా వచ్చిన లిప్తవిలిప్తలు సూర్యునిలోకూడితే అందరు గ్రహాలకుకూడేది. సూర్యునకుతీసివేస్తె అందరు గ్రహాలకుతీసేది.

పూర్వధృవ చక్రం.

| గ్ర | రాశి | భా | లిప్త | విలిప్త | — |
|---|---|---|---|---|---|
| ర | ౧౧ | ౧౬ | ౫౨ | ౩ | కూడేది |
| చ | ౧౧ | ౮ | ౪౬ | ౩౩ | ధనం |
| కు | ౦ | ౧౨ | ౨౦ | ౪౬ | ధనం |
| బు | ౭ | ౧ | ౧౨ | ౪౪ | ధనం |
| గు | ౫ | ౬ | ౧౬ | ౨౦ | ధనం |
| శు | ౧౧ | ౯ | ౯ | ౨౧ | ధనం |
| శ | ౩ | ౧౮ | ౪౯ | ౩౬ | ధనం |
| రా | ౦ | ౨ | ౩౦ | ౦ | తీసేది |
| ఉ | ౨ | ౧౭ | ౨౭ | ౧౨ | ధనం |

త్రిగుణాబ్ద సంస్కార చక్రం.

| గ్ర | హారం | భా | లిప్త | విలిప్తలు | — |
|---|---|---|---|---|---|
| ర | ౧౫౪ | ౦ | ౦ | ... | శోధ్యం |
| చ | ౪ | ౦ | లిప్త | ... | ... |
| కు | ౫౩౫౦ | భా | ... | ... | కూడేది |
| బు | ౭౮౮ | ౦ | ... | ... | శోధ్యం |
| గు | ౧౨౪ | ౦ | ... | ... | కూడేది |
| శు | ౧౯౮౩ | భా | ... | ... | ... |
| శ | ౨౮౦ | ౦ | ... | ... | ... |
| రా | ౨౫౪౦ | భా | ... | ... | ... |
| ఉ | ౯౬ | ౦ | ... | ... | శోధ్యం |

| దేశాంతర సంస్కార చక్రం. | | | | | |
|---|---|---|---|---|---|
| గ్ర | గతులు | అ | హ | విలిప్త | — |
| ర | ౫౯-౮ | ౪౦ | ౮౦ | ౨౯ | తీసేది |
| చ | ౭౯౦-౩౫ | ౪౦ | ౮౦ | ౩౯౫ | ... |
| కు | ౩౧-౨౬ | ౪౦ | ౮౦ | ౧౫ | శోధ్యం |
| బు | ౨౪౫-౩౨ | ౪౦ | ౮౦ | ౧౨౬ | ... |
| గు | ౫- ౦ | ౪౦ | ౮౦ | ౬ | ... |
| శు | ౯౬- ౮ | ౪౦ | ౮౦ | ౪౫ | ... |
| శ | ౨- ౦ | ౪౦ | ౮౦ | ౧ | ... |
| రా | ౩-౧౧ | ౪౦ | ౮౦ | ౧ | కూడేది |
| ఉ | ౬-౪౧ | ౪౦ | ౮౦ | ౩ | శోధ్యం |

దృక్సంస్కార చక్రం.

| గ్రహ | గు | భాగ | లిప్తాది | గ్ర | గు | హారం | లిప్తాది | గ్ర | గు | హారం | లిప్తాది |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ర | ౦ | ౦ | ౦ | బు | ౦ | ౦ | ౦ | శ | ౨౮ | ౧౨౫ | ధనం |
| చ | ౧౧ | ౫౧౦ | ఋణం | గు | ౧౨ | ౧౨౫ | ఋణం | రా | ౨౪ | ౨౫౦ | ఋణం |
| కు | ౧౪ | ౧౨౫ | ధనం | శు | ౪౨ | ౧౨౫ | ... | ఉ | ౧౧ | ౧౨౫ | ... |

*



| భుజాఫల చక్రం. | | | | మందోచ్చలు. | | | | | మందోచ్చాబ్ద సంస్కార చక్రం. | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహం | హారం | ధన | ఋ | గ్ర | రా | భా | లి | విలి | గ్ర | మందోచ్చాబ్ద | లి | ఋ |
| ర | ౩౬౫ | ధన | ... | ర | ౨ | ౧౭ | ౧౬ | ౩౬ | ర | ౫౧౭ | ... | ... |
| చ | ౨౭ | ... | ... | చ | ౦ | ౦ | ౦ | ౦ | చ | ౦ | ... | — |
| కు | ౬౮౭ | కు- | శో | కు | ౪ | ౧౦ | ౭ | ౨౦ | కు | ౯౮౦ | ... | ... |
| బు | ౮౮ | ... | ... | బు | ౭ | ౧౦ | ౨౭ | ౩౩ | బు | ౫౪౪ | ... | ... |
| గు | ౪౩౩౨ | ... | ... | గు | ౫ | ౨౧ | ౨౦ | ౨౪ | గు | ౨౨౭ | ... | ... |
| శు | ౨౨౪ | ... | ... | శు | ౨ | ౧౯ | ౫౧ | ౧౨ | శు | ౩౨౪ | ... | ... |
| శ | ౧౦౨౬౬ | ... | ... | శ | ౭ | ౨౬ | ౩౭ | ౩౭ | శ | ౫౧౨౮ | ... | ... |
| రా | ౦ | ౦ | ౦ | రా | ౦ | ౦ | ౦ | ౦ | రా | ౦ | ... | — |
| ఉ | ౦ | ౦ | ౦ | ఉ | ౦ | ౦ | ౦ | ౦ | ఉ | ౦ | ... | — |

రవ్యాదిగ్రహములకు మధ్యగతులు.

శ్లో॥ లిప్తావిలిప్తా స్సూర్యస్య గతిర్నవశరా ౫౯ గజాః ౮ । చంద్రస్య
శూన్యనందాశ్వి ౭౯౦ విషయాగ్న యశ్చ ౩౫ పవచ । అంగార
కస్యచక్షోణీ వహ్న యోం ౩౧ గాశ్వినో ౨౬ గతిః । జ్ఞస్యబాణ
జినా ౨౪౫ దంతా ౩౨ గురోః పంచనభః ౫ - ౦ స్తథా
శుక్రస్యాంగనవా ౯౬ ష్టౌచ ౮ సూర్యజస్యాన్వియత్ ।
షడ్భూ వేద ౬-౪౧ విధోచ్చస్య రాహోర్వహ్నయ ౩ ఈశ్వ
రాః ౧౧ ॥ కేతురేవంగతిః ప్రోక్తాః పూర్వాచార్యైర్మహర్షిభిః॥

రవ్యాది గ్రహములకు ఇవి మధ్యగతులు. స్ఫుటగ్రహములకు అష్టవిధగతులు గలవు. వాటి వివరము చెప్పుచున్నాను.

## అష్టవిధగతులు.

శ్లో॥ వక్రానువక్రా వికలామందామంద తరాసమా ।
తథాశీఘ్రాతిశీఘ్రాఖ్యా గ్రహాణామష్టధాగతిః॥

అ॥ వక్రా- వక్రమనిన్ని, అనువక్రా - వక్రారంభమనిన్ని, వికలా - వక్రత్యాగమనిన్ని, మందా-మందమనిన్ని, మందతరా-అతిమందమనిన్ని, సమా- సమమనిన్ని. తథా - అప్రకారముగానే, శీఘ్రా-శీఘ్రమనిన్ని, అతిశీఘ్రా-అతిశీఘ్రమనిన్ని, అష్టవిధా-ఎనిమిదివిధములయిన, గతి-గతులని, జ్ఞేయా- తెలియదగినది.

## ఋజ్వియందు.

శ్లో॥ తత్రాతిశీఘ్రశీఘ్రాఖ్యా మందామందతరాసమా ।
ఋజ్వీతిపంచధాజ్ఞేయా యావక్రాసానువక్రితా ।
తత్తద్గతివశాన్నిత్యం యథాధృక్తుల్యతాం గ్రహాః ।
ప్రయాంతితత్ప్రవక్ష్యామి స్ఫుటీకరణమాదరాత్ ॥

అ॥ ఋజ్వీతి-ఋజ్వియందు, తత్ర-అప్రకారముగానే, అతిశీఘ్రా-అతిశీఘ్రమనిన్ని, శీఘ్రాఖ్యా - శీఘ్రమనిన్ని, మందా - అతిమందమనిన్ని, మందతరా - మందతరమనినిన్ని, సమా - సమమనినిన్ని, పంచధా - అయిదు విధములయినగతిజ్ఞానము, జ్ఞేయా - తెలియతగినది, యావక్రా - వక్రమందున్ను, ఆసానువక్రితా - ఋజ్వియందున్ను, తత్తత్-ఆయాయాగతివశాత్, గతివశం-వల్లనుంచిన్ని, నిత్యం-యల్లప్పుడును, గ్రహాః-గ్రహములు, దృక్తుల్యతాం-దృక్తుల్యత్వము, యథా-యేప్రకారము, ప్రయాంతి-పొందుచున్నారో, తత్-అప్రకారముగాను, స్ఫుటీకణం-స్ఫుటీకణమును, ఆదరాత్-పొందుచున్నారని, ప్రవక్ష్యామి-చెప్పుచున్నాను.

## అష్టవిధగతుల సులభోపాయము.

శ్లో॥ సూర్యముక్తాఉదీర్యంతే శీఘ్రగాశ్చద్వితీయకే ।
సమంతృతీయకేయాంతి మందగత్యాశ్చతుర్థకే ।
వక్రపంచమషష్ఠేర్కే అతివక్రోష్టసప్తమే ।
నవమేదశమేవాపి ఏతేషాంకుటిలాగతిః ।
ఏకాదశేద్వాదశేవా శీఘ్రాశీఘ్రతరాక్రమాత్ ॥

అ॥ సూర్యునితోకూడిన గ్రహం, అస్తమయం, సూర్యునివిడిస్తే ఉదయం, ౨ తావునశీఘ్రగతి ౩ తావునసమగతి, ౪ తావునమందగతి, ౫ స్తంభగతి, ౬ వక్రం, ౭ వక్రం, ౮ అతివక్రం, ౯ ఋజుగతి, ౧౦ కుటిగలది, ౧౧ శీఘ్రగతి, ౧౨ అతిశీఘ్రగతిఅని తెలిసేది.



శ్లో॥ వక్రగామీసదారాహు । శీఘ్రగౌచంద్రభాస్కరౌ ।
క్రూరవక్రామహాక్రూరా సౌమ్యవక్రాస్తుశోధనాః॥

రాహుకేతువులకు యెప్పటికిన్ని వక్రగ్రహాలు, చంద్రసూర్యులకు వక్రగతి లేదు. ఋజుగతిగలవారు.

శ్లో॥ మధ్యాహ్నాత్పూర్వజన్మాని ఘటీత్యహరర్ధశోధితే ।
మధ్యాహ్నాత్పరతోజన్మ ఘటికావిఘటీషుచ ।
దినార్ధశోధితంశేష మేష్యకాలయుతాయుతం॥

అ॥ మధ్యాహ్నంలోపల జననమైనవారికి జన్మకాలఘుడియలు అహారర్ధలో శోధిస్తేను గతకాల ఘుడియాలగును.

శ్లో॥ గతగమ్యేష్టనాడిఘ్నా గతిష్షష్టివిభాజితా ।
ఫలేనహీనయుక్తాచే ద్గ్రహస్తాత్కాలికోభవేత్ ।
రాహోర్వ్యత్యయమేవంచ ఇతిశాస్త్రేషుసమ్మతం॥

అ॥ గతఏష్య సంబంధమయిన ఇష్టకాలఘుడియలను మధ్యగ్రహ విషయమై మధ్యగతులచేతనున్ను, స్ఫుటగ్రహవిషయమై, స్ఫుటగతులచేతనున్ను గుణించి ౬౦ంటభాగించగా లబ్ధలిప్తాదిని గతమైతే తీసేది. ఏష్యమైతేకూడితేను తాత్కాలిక గ్రహములగును. వక్రగతిఅయినప్పుడు గతమైతేకూడి యేష్యమైతే శోధించేది.

## అథమందోచ్చాని.

శ్లో॥ ద్వ్యగేందునృపషడ్రావా ౨-౧౭-౧౬-౩౬ స్సూర్యమంద ధృవస్తథా । కుజస్యవేదదిక్షట్చత్ర నఖాః౪-౧౦-౨-౨౦ సోమసుతస్యతు । శైలాశాతారకాదేవా ౭-౧౦-౨౭-౩౩ స్స్యాన్మందోచ్చధృవస్తథా । పంచేందు దృజ్నఖజినాః ౫-౨౧-౨౦-౨౪ గురోర్మందోచ్చకధ్రువః । ద్వ్యంకేందుష్షూన్ధరవయః ౨-౧౯-౫౧-౧౨ శుక్రమాందధృవోభవేత్ । సప్తాంగాశ్వితురంగాగ్ని దంతా౭-౨౬-౩౭-౩౨ స్సూర్యసుతస్యతు॥ అర్థంస్పష్టం.

అథ మందోచ్చాబ్ద సంస్కారః.

శ్లో॥ శైలేందుబాణైః ౫౧౭ ఖగనాష్టనంద్వైర్౯౦ కృతాబ్ధిబాణైః
౫౮౮౮ యనాశ్వినేత్రైః ౨౨౨ యుగాద్రిరామైః ౩౭౮ గజ
భానుబాణైః ౫౧౨౮ రబ్దాత్ఫలంస్వోచ్చ కలాసుయుంజాత్ ॥

అ॥ ధృవాబ్దాలుపెట్టుకొని రవికి ౫౧౭ కు౯౦ బు౫౮౮౮ గు౨౨౨ శు౩౭౮ శని౫౧౨౮టు అబ్దాలనుభాగించగా వచ్చినలిప్తవిలిప్తలు వారివారికికూడితేను రవి-కు-బు-గు-శు-శనికి స్ఫుటమందోచ్చలగును. యీమందోచ్చలవలన మాందస్ఫుటం చేసేది.

శ్లో॥ కార్తాంతికేంద్రచంద్రస్య భారద్వాజసగోత్రిణాం ।
గోపాలకృష్ణసిద్ధాంతీ మధ్యాధ్యాయో మయాకృతః ॥

ఇతి బ్రహ్మశ్రీ మక్కపాటి వెంకటరమణయ్య సిద్ధాంతి సుబ్బరాయ
సిద్ధాంతిగారి ప్రియశిష్య, రాళ్ళబండి. గోపాలకృష్ణ
సిద్ధాంతివిరచితే మధ్యాధ్యాయః ప్రథమః॥

---

# స్ఫుటాధ్యాయః.

## ప్రారంభః.

శ్లో॥ అగజాననపద్మార్కం గజాననమహర్నిశం ।
అనేకదంతంభక్తానా మేకదంతముపాస్మహే॥

శ్లో॥ స్వోచ్చంగ్రహోనంకేంద్రంస్యా త్తత్వదేవిషమేగతః।
యుగ్మేగమ్యేభుజోమాందే భుజత్రిభోనకోటిజం ॥

అ॥ స్వకీయ్యమైన మాందములోను గ్రహమునుశోధించిన మందకేంద్రమగును. ఆకేంద్రము ఓజపదమగుచుండగా గతభుజయనిన్ని, యుగ్మపదమగుచుండగా ఏవ్యభుజయని తెలిసేది. భుజను ముందు చెప్పబోయ్యెప్రకారము సాధించి భుజను ౩రాసులయందు శోధించిన కోటియగును.



భుజసాధనక్రమం.

శ్లో॥ కేంద్రేత్రిభాల్పేతుతదేవబాహుస్త్రిభోర్ధ్వకేచక్రదళాద్విశోధ్యం
షడ్భాదికేషడ్భహీనంభుజస్స్యాన్నవాధికంచేద్భగణాద్విశోధ్యం॥

అ॥ గ్రహమును తమతమ మందోచ్చలోతియ్యగా మిగిలినశేషము కేంద్రమగును. ఆకేంద్రము ౩రాసులవరకు ఓజపదం, ౩రాసులకుపైన ౬రాసులవరకు యుగ్మపదం, ౬రాసులకుపైన ౯ రాసులవరకు ఓజపదమనియూ, ౯ రాసులకుపైన ౧౨రాసులవరకు యుగ్మపదమనియూ, ఎరుగనగును. అందు ఓజపదమందు గతభుజయగును. యుగ్మపదమందు ఏవ్యభుజయగును. యీప్రకారము మందభుజసాధించి భుజను ౩రాసులలోతీసిన కోటియగును. మందభుజయనగా కేంద్రము ౩రాసులకంటె తక్కువైనయడల అదేభుజయగును. ౩రాసులకు అధికమైన ౬రాసులలో రాస్యాదిగా శోధించగా శేషంభుజయగును. మరియు ఆకేంద్రము ౬రాసులకు అధికమైన ౬ రాసులలో రాస్యాదిగా శోధించగా శేషంభుజయగును. మరియు ఆకేంద్రము ౬రాసులకు అధికమై ౯రాసులలోగా వున్నయడల దానిలో ౬రాసులు శోధించగా మిగిలినది భుజయగును. కేంద్రము ౯ రాసులకు అధికమైతే ౧౨రాసులలో శోధించినది భుజయగును. యీభుజను ౩ రాసులలో శోధించిన కోటియగును, యిటుల భుజకోట్లుసాధించుక్రమము.

ప్రత్యక్షం.

రవి ౧-౨-౩-౪౧ మాందం౨-౧౭-౧౭-౨౩ కేంద్రము ౦-౨౪ ౧౩-౪౨ ఇది ౩ రాసులలోగా వున్నందున ఇదేభుజయగును. ఓజపదమగుటచేత గతభుజ ౦-౨౪-౧౩-౪౨ యీభుజను ౩రాసులలోశోధించిన కోటియగును ౨-౫-౪౬-౧౮ ఇటులసాధించేది.

మాందస్ఫుటసాధనం.

శ్లో॥ భాగాదిఖాధృతి౧౮౦వి శోధ్యఘ్నేనహత్వా ।
భాగాదిశూన్యరిపు ౬౦ భాజితలబ్ధలిప్తా ।
పూర్వోఫలేయుత భుజజ్యావిభాగమేతి ।
భేదస్యహారరవిజాంత భుజాఫలంస్యాత్ ॥

అ॥ భుజరాశిభాగలుచేసి ౧౮౦ట్లో భాగాదినితీసిన శేషమును ఫలముని గుర్తెరిగి, ఆఫలభాగలిప్తాదిని భుజరాశిభాగలుచేసిన భాగలిప్త విలిప్తలుచేత చతుర్వృత్తివ్యాయానగాని నవప్రతివ్యాయానగానిగుణించి కిందప్రతిలిప్తాదిని ౬౦టి భాగించిపైనకూడి పైప్రతి ౬౦టుభాగించి భాగలయందుండు ప్రతిలోకు-డితేను భుజజ్యాయగును. ఆభుజజ్యనువారిహారిభేదములుచాతభాగిస్తేను భుజాఫలంవచ్చును

## మధ్యభేదాలు.

శ్లో॥ సూర్యోయుగాగ్ని ప్రతిభాగ్యృహ ౪౫౩౪ చంద్ర నేత్ర అంకా
క్ష్యంకసోమ ౨౯౯౧ కుజదంతిషుదంతె ౮౫౮ సౌమ్యాః। సప్తా
గ్ని సోమకర ౩౧౩౭ గీష్పతినాఖఖాంకరూపస్య ౧౯౦౦ దైత్య
గురు విక్రమఖాగ్ని పుత్ర ౫౩౦౩ మందస్యబంధుశుభ చక్షుశ
శాంక ౧౨౯౪ లబ్ధా భేదస్య మధ్యమసుధీమునయోవదంతి॥

అ॥ సూర్యునకు ౪౫౩౪ చ ౨౯౯౧ కు ౮౫౮ బు ౨౧౩౭ గు ౧౯౦౦ శు ౫౩౦౩ శనికి ౧౨౯౪ ఇవి మధ్యభేదాలు.

## భేదస్యభుజాఫల వశాత్ స్ఫుటభేదమాహ.

శ్లో॥ భాస్కరాదశ ౧౦ చంద్రస్య ఏకనేత్ర ౨౧ కుజస్యచ। వాజ్మంత్రి
౫౨ బుధపుత్రాక్షి ౨౫ గురుశత్రుధనం ౨౬ భృగుః। వ్యోమ
౧౨ మందస్తుబంధ్వగ్ని ౩౪ భుజిజ్యావిహృతంఫలం। మధ్య
భేదవిధానంతు స్ఫుటభేదమిహోచ్యతే॥

అ॥ రవికి ౧౦ చ ౨౧ కు ౫౨ బు ౨౫ గు ౨౬ శు ౧౨ శనికి ౩౪ ట భుజజ్యనుభాగహరించగా వచ్చినలబ్ధమును తమతమమధ్యభేదములలో శోధించిన శేషము స్ఫుటభేదములగును.

## మాందస్ఫుట పదకముల సాధనంబు.

భాగాదిఖాధృతి విశోధ్య అనింన్ని స్ఫుటబేధసాధనంబు.

భేదము॥ సూర్యాయుగాగ్ని ప్రతిబింబగృహ సూర్యునికి ౪౫౩౪ మధ్యబేధము.

శ్లో॥ భాస్కరాద్దశ చంద్రస్య ఏకనేత్ర అనిన్యాయం॥

అ॥ భుజజ్యను ౧౦ ట భాగించగా వచ్చినలబ్ధం సూర్యునికిన్ని భుజజ్య ౨౧ ట భాగించగావచ్చినలబ్ధం చంద్రునికిన్ని దీనిని భేదములలో శోధిస్తే స్ఫుటభేదములగును.

తిరుగా యీ భేదమునకు కోటిజ్యా సంస్కారంచేస్తే, కాని స్ఫుటభేదము లేదు. గనుక భుజజ్యను స్ఫుటభేదములలో నేకొన్నిచ్చి సంస్కారము చేయవలయును.

అందుకు శాస్త్రం సూర్యునికి.

శ్లో॥ ఖాదిశూన్యేందుపర్యంతం సర్వాంస్వాంభేదసంస్కృతం।
తదాదిఖాక్షిపర్యంతం భేదార్ధంతుయుతస్యచ।
తదాగ్నిఖాగ్నిపర్యంతం త్రిబాజితఫలంయుతం।
తదాదిఖాబ్ధిరంఖాక్షాది ౫౦ పర్యంతం దాస్తిమేవచ।
తదాదికోటిషష్ఠాంశం ఋణంకుర్యాచ్చభేదకం॥



## బుధునకు.

శ్లో॥ కోటిజ్యా చంద్రసంస్కారాం ద్వాదశాంతంచ సంస్కరేత్।
ఖాదిశూన్యాగ్ని ౩౦ వర్న్నస్తుభాగాస్తు ధనసంజ్ఞికాః।
తథాధికేరుణంకుర్యాత్ భేధమృజ్యా ఫలంస్మృతం॥

అ॥ కేంద్రము సున్న మొదలుకొని ౯ భాగలవరకు భేదములో కోటిజ్యను అంతకూడేది ౧౦ భాగము మొదలుకొని ౧౯ భాగమువరకు సగమున్ను ౨౦ భాగము మొదలుకొని ౨౯ భాగమువరకు కోటిజ్యలో ౩ వంతున్ను భేదములోకూడేది.

౩౦ భాగముమొదలుకొని ౪౯ భాగమువరకు భుజిజ్యసంస్కరించిన భేదమే స్ఫుటభేదము. ౫౦ మొదలుకొని ౯౦ భాగములవరకు కోటిజ్యలో ౬ అంగుల భేదములో తీసివేసిన భేదలంతభాగిస్తె స్ఫుటభేదమగును. కోటిజ్యను చంద్రునకు ౧౨ ట భాగించగా వచ్చినలబ్ధము ౩ భాగములవరకు భేధములోధనమున్ను ఆపైని రుణమున్ను చాయవలసినది.

## ప్రత్యక్షం.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | భు | ౧౭౯ | కోటిజ్య | ౬౯-౩౧ | భేదం | ౪౫౮౫-౩౧ | సర్వం. |
| ౧౦ | భు | ౧౭౦౦ | కోటి | ౬౬-౪౩ | భేదం | ౪౩౯౭-౪౩ | సగం. |
| ౨౦ | భు | ౩౨౦౦ | కోటి | ౬౨-౧౬ | భేదం | ౪౨౩౪-౫౮ | మూ. |
| ౩౦ | భు | ౪౫౦౦ | కోటి | ౫౭-౧౨ | భేదం | ౪౦౮౪-౦ | లేదు. |
| ౪౦ | భు | ౫౬౦౧ | కోటి | ౫౦-౩౭ | భేదం | ౨౯౩౭-౦ | లేదు. |
| ౫౦ | భు | ౬౫౦౦ | కోటి | ౪౨-౪౩ | భేదం | ౩౮౭౭-౦ | కి౬ము. |
| ౬౦ | భు | ౭౨౦౦ | కోటి | ౩౩-౩౬ | భేదం | ౩౮౦౯-౦ | కి౬ము. |
| ౭౦ | భు | ౭౭౦౦ | కోటి | ౨౩-౪౫ | భేదం | ౩౭౬౬-౦ | కి౬ము. |
| ౮౦ | భు | ౮౦౦౦ | కోటి | ౧౨-౬ | భేదం | ౩౭-౩౨ | కి౬ము. |
| ౯౦ | భు | ౮౧౦౦౦ | కోటి | ౦-౧ | భేదం | ౫౭౨౪-౦ | కి౬ము. |

చంద్రునికి యీప్రకారమును.

అ॥ ఆస్ఫుటభేదంచాతను భుజజ్యనుభాగహరించగా వచ్చినభాగాది భుజాఫలమగును. ఆభుజాఫలము కేంద్రము మేషాదిఅయనా ధనమున్ను తులాదిఆయినా రుణమున్ను చేసేది.

## భుజాఫలసంస్కారం కోటిఫలసంస్కారం చేయుక్రమము.

శ్లో॥ భుజాఫలంధనర్ణంస్యాత్ మేషజూకాది కేంద్రగే।
కోటిజ్యాదిఫలంకేంద్రే స్వర్ణంకర్కిమృగాదిగే॥

అ॥ కేంద్రము ౬ రాసులలోగావుండెనా మేషాది అనితెలిసేది. ౬ రాసులకుపైన ౧౨ రాసులకులోగావుండెనా తులాదిఅని తెలిసేది. మేషాది కేంద్రమైన

భుజాఫలంధనము గనుక కూడేది. తులాదికేంద్రమైన భుజాఫలము రుణము గనుక గ్రహములలో తీసేది.

కోటికి కేంద్రము ౩ రాసులు మొదలుకొని ౯ రాసులవరకు కర్క్యాది కేంద్రము ౯ రాసులు మొదలుకొని ౩ రాసులవరకు మకరాది కర్క్యాది అయినగతిఫలం ధనం. మకరాదిఅయినగతి ఫలంరుణముఅని తెలియవలయును.

## ప్రత్యక్షం.

కేంద్రము ౦-౨౪-౧౩-౪౭ అదే భుజ ౦-౨౪-౧౩-౪౭ కోటి ౨-౫-౪౬-౧౮ భుజభాగాది ౨౪|౨౭ని ౧౮౦ట్లో శోధించిన శేషము ౧౫౫-౪౬ ఉన్న భుజభాగాది ౨౪-౧౩టును ఫలము ౧౫౫-౪౬టును చతుష్పృత్తిన్యాయానగుణించగా ప్రతి ౩౭౨౦ వెన్ని ౨ ప్రతి ౧౧౦౪ న్ను ౩ ప్రతి ౨౦౧౫ న్ను ౪ ప్రతి ౫౯౮ న్ని ౬౦ట భాగించిన లబ్ధాన్ని పైప్రతిలో కూడిమధ్యయుతంచేసితే ౩౧౨౮ ఆయను. ఇది ౬౦టభాగించగా వచ్చిన లబ్ధం ౫౨-౮ ఇది పైభాగలప్రతిలో కూడితేను ౩౭౭౨-౮ ఇది భుజజ్యయగును. యీభుజజ్యను పెట్టుకొని సూర్యునికి ౧౦టభాగించగా వచ్చినలబ్ధము ౩౭౭న్ను సూర్యుని భేదమగు ౪౫౩౪ లోను ౩౭౭ శోధించిన ౪౧౫౭ స్ఫుటభేదమాయను. ముందు చెప్పబొయ్యేప్రకారంచేయగా రాబడినకోటిజ్య ౬౦-౩౭ వచ్చెను. సూర్యునికియిందులో ౬ అంశం ౧౦-౫న్ను కేంద్రము ౨౦ భాగములకు తక్కువగావున్నందువల్లధనము గనుకస్ఫుటభేదమగు ౪౧౫౭ట్లో కూడగా ౪౧౬౭ స్ఫుటభేదమాయను. దీనిచాతను భుజజ్యయగు ౩౭౭౨-౮టిని పాల్గొన్నలబ్ధంభాగలు ౦ సున్నాను శేషం ౬౦ట గుణించినది ౨౨౬౩౨౮ యీ స్ఫుటభేదంచాత పాలుగొన్నలబ్ధం లిప్తలు ౫౪౧న్ను శేషం ౧౩౦౪౬న్ను ౬౦టగుణించి స్ఫుటభేదంచాత పాలుగొన్నలబ్ధం విలిప్తలు౧౮ ఆయను. యీభాగాది౦-౫౪-౧౮న్ను సూర్యుడుమేషాదిగానకూడగా స్ఫుటసూర్యుడు రాశ్యాది ౧-౨౩-౫౮-౬ ఆయను.

## కోటిజ్యాదిఫలసాధనం.

శ్లో॥ కోటిభాగాదిరామేందు ౧౩భక్తాభాగాదిజంఫలం।
సప్తేందు౧౭హీనభాగాది స్థాప్యాకోటిత్రయోదశా।
అంశభాగాదిగుణితా షష్ట్యా౬౦ప్తఫలయుక్సదా।
కోటిజ్యాభేదభక్తంతు లబ్ధంగతిఫలంభవేత్॥

ఆ॥ కోటిరాశ్యాది భాగలనుచేసి ౧౩ట భాగించగా వచ్చినభాగాదిని ౧౭ భాగలలో శోధించిన శేషభాగాదులచాతను కోటిత్రయోదశాంశభాగాదిని చతుష్పృత్తి న్యాయానగుణించి ౬౦టభాగించి మధ్యయుతంచేసి ౬౦టభాగించి పైభాగముల ప్రతిలోనుకూడితేను కోటిజ్యయగును. ఆకోటిజ్యను వారివారిభేదములచాత



భాగిస్తేను గతిఫలంవచ్చును. ఆ గతిఫలమును కేంద్రము, కర్క్యాది, మకరాది, గుర్తెరిగి మధ్యగతులలో సంస్కరిస్తేను స్ఫుటగతులగును, ఎట్లనగా కర్క్యాదిఅయితే మధ్యగతిలో తీసిన స్ఫుటగతియగును. యీప్రకారము అందరికిమాందస్ఫుటగతు లేర్పడును.

## భేదాలు.

శ్లో॥ సూర్యస్యభాగ్ని౩౦చంద్రస్య కళానిధి౧కుజస్యచ।
లాభో౧౧బుధస్యపంచేందు ౧౫గురుఃఖాబ్ధిశశి౧౪౦భృగుః।
పంచాగ్ని౩౫శనివేశ్మాబ్ధి నయస్త్వేరరభేదకాఃస్మృతాః।
కోటిజ్యాచ్ఛేదభక్తాస్యుర్లిప్తాగతిఫలంభవేత్॥

## ప్రత్యక్షం.

కోటి౨-౫-౪౬-౧౮ భాగలుచేస్తే౬౫ ఆయను ఇది౧౩టుభాగిస్తే భాగాది ౫-౩-౩౩ వచ్చెను. యీత్రయోదశాంశభాగాది ౧౭టిలో శోధించిన శేషము ౧౧-౫౬-౨౭ ఆయను. ఇది౧౧-౫౭టిని చతుష్పృత్తి న్యాయాన పెట్టుకొని త్రయోదశాంశభాగాదియగు ౫-౪టునుగుణించి ౬౦టుభాగించి క్రమముగాకూడితేను కోటిజ్య ౬౦-౩౨ వచ్చెను. ఇదిసూర్యభేదమగు ౩౦టపాలుగొనగా వచ్చినలబ్ధం లిప్తలు౨న్ను విలిప్తలు౧న్ని కేంద్రము మకరాదిగనుక సూర్యునిగతియగు ౫౯-౮టిలో ౨-౧గతిఫలంశోధించగా స్ఫుటగతి౫౭-౭ ఆయను.

పూర్వోక్తప్రకారము సులభముగామాందఫలకములువచ్చు ఉదాహరణము వ్రాయబూనుచున్నాను.

## ప్రత్యక్షం.

భుజభాగాదిని ౧౮౦టిలో శోధించగా మిగిలిన శేష భాగాదిచాతను భుజభాగాదిగుణించి భాగలుగాక మిగిలిన అన్నిస్థానములు ౬౦టభాగించి పైనకూడితే భుజజ్యయగును. యీ భుజజ్యను స్ఫుటభేదములచాత భాగించగా వచ్చినభాగాది వారివారిమాంద భుజాఫలములగును.

భేదములు॥ రవికి౪౫౩౪ చంద్రునికి౧౯౯౧ కుజునికి౮౫౮ బుధునికి౭౧౩౭ గురునికి౧౯౦౦ శుక్రునకు౫౩౦౩ శనికి౧౭౯౪ ఇవిమధ్యభేదములు.

భుజజ్యను పెట్టుకొని సూర్యునకు౧౦ట చంద్రునకు౨౧ట కుజునకు౫౨ట బుధునకు౨౫ట గురునకు౭౬ట శుక్రునకు౧౨ట శనికి౪ట భుజజ్యనుభాగించగా వచ్చినలబ్ధం వారివారిమధ్యభేదములలోపుచ్చితే స్ఫుటభేదములగును. యీస్ఫుటభేదములచాత భాగించగా వచ్చినలబ్ధఫలం మాందఫలకఫలమగును.

## స్ఫుటగతిః.

కోటిభాగాదిని ౧౭౭టుభాగించగా వచ్చినభాగాది ౧౭౭టిలోతీసివేయగా మిగిలినభాగాదిచాతను కోటిత్రయోదశాంశభాగాదిని చతుష్పంక్తిన్యాయాన గుణించిక్రిందిప్రతులు ౬౦టుభాగించిపైనకూడితేను కోటిజ్యయగును. యీకోటిజ్యను సూర్యునకు౩౦టు చంద్రునకు ౧టు కుజునకు ౧౦టు బుధునకు ౧౫టు గురువుకు ౧౮౦టు శుక్రునకు ౩౫టు శనికి౭౮౪టుభాగించగా లిప్తాదు వారివారిమాందగతి ఫలంబులగును. యీమందగతిఫలం, కర్క్యాది, మకరాదిని తెలిసి ధనరుణాలుచేసేది. యీప్రకారంచేస్తే గ్రహాలుమాందస్ఫుటాలగుదురు॥

## అయనాంశసాధనంబు.

శ్లో॥ కల్యాద్యబ్దాషష్టి ౬౦క్నృశోన్యనితంతత్।
ఆశాంశోనాషష్టి భక్తాయనాంశాః॥

అ॥ కల్యాద్యబ్దాలలోను ౩౬౦౦శోధించగా మిగిలినశేషమును రెండుప్రతులుగావుంచి క్రిందిప్రతి ౧౦టుభాగించగా వచ్చినలిప్తాదిని పైప్రతిలోతీసివేసి ౬౦టుభాగిస్తేను భాగాదిఆయనాంశలగును.

## సులభోపాయముగా అయనాంశసాధనం.

## చరసాధనము.

శ్లో॥ భూలోచనాబ్ధ్యూన ౪౨౧ శకేంద్రకాల।
స్త్రీఘ్నోవియత్ఖాశ్వి ౨౦౦హృతాయనాంశాః॥
నఖఘ్నావిషువచ్ఛాయా స్వాక్షాంగశోనాహిమధ్యమా।
త్రిభాజితఫలంచాంత్యా చరజ్యాస్యాత్ స్వదేశజా॥

అ॥ స్వదేశవిషువఛాయా ౩-౩౬న్న ౨౦టుగుణిస్తేఆదిచరమగునును. ఆదిచరమును ౫టుభాగిస్తేల్లబ్ధం. ఆదిచరములో శోధిస్తేను మధ్యచరమగును. ఆదిచరమును ౩టుభాగిస్తె అంత్యచరమగును. ఇవిసగంచేస్తే చరార్ధములగును.

## చరాలు.

శ్లో॥ కరశైలా ౭౨ అవసుకరా ౫౮ వేదాక్షీచ ౨౪ చరః క్రమాత్॥

## చరఖండాలు.

శ్లో॥ షడ్రామ ౩౬ గోశ్వినో ౨౯ నాగాచ్చ ౧౨ చరఖండానివాత్రయీ॥

## అహస్సుసాధనము.

శ్లో॥ సాయనాంశార్కకేంద్రస్యా భుజస్సాధ్యచరైర్హతం।
ఖంభదాదిచరేణైవ గుణయేత్తద్యథాక్రమాత్॥



ఏకేనాదిచరంక్షిప్త్వా అధోమధ్యేనసంగుణాత్।
ఆదిమధ్యచరంక్షిప్త్వా ద్వయంచాంత్యేనసంగుణాత్॥
షష్ట్యాషష్ట్యాఃఖరామైశ్చ భక్తలబ్ధంతతోర్ధ్వగయుక్।
భాగాదిశేషంహిత్వాతు సర్వంషష్ట్యావిభాజయేత్॥
లబ్ధంరాశిస్థానయుతం రాశీచరవినాడికాః।
ఉత్తరంచచరంయోజ్యం శోధ్యంయామ్యచరామయోః।
తద్దినేదినమానంస్యాత్ షష్ట్యాశోధ్యంతుశర్వరి॥

అ॥ స్ఫుటరవిలో అయనాంశలుకూడగా సాయనరవియగును. ఆసాయనరవిని పూర్వోక్తప్రకారము భుజసాధించగా ఆభుజరాశిస్థానము సున్నావున్నయడల క్రిందిభాగలిప్తాదులను ఆదిచరముచాత ప్రత్యేకముగా రాశ్యాదిగుణించవలెను. మఱియు రాశిస్థానముఒకటివున్నయాడల రాశిస్థానమందు ఆదిచరంవుంచి మధ్యచరంచాత భాగాదినిప్రత్యేకముగా గుణించవలసినది. ఆభుజరాశిస్థానము రెండువున్నయడల ఆరాశిస్థానముందు ఆదిమధ్యచరాలురెండుకూడి రాశిస్థానముందుంచి ఆభుజభాగాదులుఅంత్యచరంచాతగుణించి విలిప్తలు౬౦టుభాగించి భాగలలోకూడి భాగలను ౩౦టుభాగించగా వచ్చినలబ్ధం. రాశిస్థానమందు చరఖండములయందు కలపగా చరవినాడులగును. ఆచరవినాడికలు ౬౦టుభాగించగావచ్చిన లబ్ధం, ఘడియలు శేషమువిఘడియలగును. యీఘడియవిఘడియలు సాయనరవి ౬ రాసుల లోగావున్నయాడల మేషాదిగనుక ధనమనియరుగు. సాయనరవి ౬ రాసులకుపైన ౧౨ రాసులలోగావున్నయడల తులాదిఘుట్కముందుండును గనుకఅప్పుడుయామ్యమనిచెప్పబడును. సౌమ్యాయనమైన పైఘడియవిఘడియలు ౩౦లోకూడేది. యామ్యాయనమైన ఘడియవిఘడియలు ౩౦ట్లోశోధిస్తె అహప్రమాణమగును. అహప్రమాణమును సఖంచేస్తె దినార్ధయగును. అహప్రమాణము ౬౦ట్లోశోధిస్తె రాత్రిప్రమాణము.

## సూర్యాదిగ్రహములకు అందరికి అహస్సుసాధనం.

శ్లో॥ గ్రహోదయప్రాణహతా ఖఖాష్టైకో౧౮౦౦ధృతాగతిః।
చక్రాసవో ౨౧౬౦౦లబ్ధయుతాఃస్వాహోరాత్రాసవస్మృతాః॥

అ॥ గతిః-స్ఫుటగతి,(గ్రహోదయప్రాణహతా)గ్రహ-గ్రహములయొక్క, ఉదయ-లగ్నంయొక్క, ప్రాణా-ప్రాణకాలములచాతను, హతా-గుణించి, ఖఖాష్టైకః-౧౮౦౦ంటిచాతను, ధృతాః-భాగించగావచ్చినలబ్ధము, చక్రాసవః-చక్రాసువులగు ౨౧౬౦౦ంటియందు, ఆసవః-అసువులు, యుతాః-కూడితేను, స్వ-స్వకీయమైనటువంటి, అహోరాత్రాసవః-అహోరాత్రాసువులు, ఇవి౩౬౦టుభాగిస్తేను అహోరాత్రప్రమాణము సూర్యుడుమొదలుకొని శనివరకుఅగును.

## ప్రత్యక్షం.

సూర్యస్ఫుటగతి౬౧-౨౬ చంద్రస్ఫుటగతి౭౮౦-౧౬ సింహలగ్నప్రమాణము ౩౩౦విలిప్తలు ఇవి౬టగుణిస్తే అసువులు౧౯౮౦ యీఅసువువచ్చినలబ్ధం సూర్యునికి ౬౪-౩౫ చంద్రునికి౭౬౦-౧౬ చంద్రాసువులకు ౨౧౬౦౦టియందుకూడి ౩౬౦ట భాగిస్తే సూర్యునికి౬౦-౧౧ చంద్రునికి౬౨-౩౭ అహోరాత్రప్రమాణములగును. కుజాదులకు యీలాగె పూర్వమువలనే గ్రహములలో అయసాంశలుకూడి చరార్ధములవల్ల ఫలమునుసాధించి సూర్యునికివలెనే అహస్సుసాధించవచ్చును.

## తిథిసాధనము.

శ్లో॥ వ్యర్కేందుభాగాభక్తాస్స్యుః స్థిథయః కరచంద్రమాః౧౨।
గతగతమ్యాశ్చషష్టిఘ్నా భుక్త్యంతురఖితర్కహృత్।
విభాజితఫలందాడ్యా దినార్ధేవియుతాయుతః॥

ఆ॥ స్ఫుటిసూర్యునిచంద్రునిలో శోధించగావ్యర్కేందనజను, అన్యర్కేందునుభాగలుచేసి ౧౨టభాగిస్తె లబ్ధంగతతిథులగును. ఆశేషం౩కి తక్కువాయనా గతతిథియనియు, ఎక్కువాయనా ఏష్యమనియరిగేది. గతమాయనా౬౦టగుణించి తిరుగా ౬౦టగుణించి చంద్రగతిలో సూర్యగతితీసివేసిన లిప్తలచాతభాగిస్తె ఘుడియవిఘుడియలొచ్చును. ఏష్యమాయనా ౧౨ట్లోశోధించి లిప్తలుచేసి వ్యర్కేందుగతి ౬౦టిచాతభాగిస్తె ఘుడియ విఘుడియలురాబడును. అవి అహర్గర్ధలోగతమైతే శోధించేది. ఏష్యమైతేకూడేది. తిథిఘుడియలు విఘుడియలగును.

## నక్షత్రసాధనము.

శ్లో॥ చంద్రభాగకలాస్త్రిఘ్నా భానిశూన్యాబ్ధిరంభాజితా।
గతగమ్యాశ్చషష్టింఘ్నా వహ్ని౩ఘ్నాశశిభుక్తిహృత్।
ఫలానినాడికాద్యంస్యా ద్దినార్ధేసంస్కృతాభవేత్॥

ఆ॥ స్ఫుటచంద్రుని భాగలుచేసి ఆభాగలిప్తవిలిప్తలు ౩టగుణించి ౮౦ట భాగిస్తేలబ్ధం గతనక్షత్రములు శేషం౧౦టికిలోగాగతం. ఆపైన ఏష్యంఅనితెలుసుకొని గతమైతే అట్లాగెలిప్తలుచేసేది. ఏష్యమైతె ౮౦ట్లోశోధించి ౬౦ట గుణించి లిప్తలుకూడితెవిలిప్తలగును. ఇదిచంద్రస్ఫుటగతిని ౩టగుణించిభాగించగా ఘుడియవిఘుడియలురాబడును. అవిఅహర్గర్ధలో గతఏష్యములెరిగి సంస్కరించేది.

## యోగసాధనము.

శ్లో॥ రవిచంద్రయోగభాగా లిప్తాస్త్రి౩ఘ్నాఖాబ్ధిరం భాజితాని యోగాస్స్యుః। గతఏష్యషష్టిహత్వా గతియుక్తాః స్త్రిఘ్న బాజితాచ్చనాడ్యాది। దినదళ వియుతాఅయుతాః సంస్కార్యాదేష్యగమ్య సంజ్ఞాది॥



ఆ॥ స్ఫుటసూర్యుని స్ఫుటచంద్రునికూడి భాగలుచేసి భాగలిప్తవిలిప్తలు ౩టగుణించి ౮౦టభాగిస్తె యోగంవచ్చును. నక్షత్రమువలెనే గతఏష్యములెరిగి సూర్యచంద్రగతులుకూడి ౩టగుణించిభాగించగా రాబడినలబ్ధఘుటికాదిని గతఏష్యములెరిగి అహర్గర్ధలో సంస్కరించేది.

## సాధారణసంవత్సర జ్యేష్ఠశు౧౨ ఆదివారం.

స్ఫురవి౨-౮-౨౬-౨౪ గ౫౬-౫౬ స్ఫుటచ ౬-౨౯-౫-౩౭ గ౭౨౦-౫౮ వ్యర్కేందు ౮-౨౦-౩-౧౧ గ౬౫౩-౫౭ వ్యర్కేందు భాగలుచాయగా,౧౪౦ దీనిని ౧౨టుభాగించగా లబ్ధం౧౧ఏష్యంగా ద్వాదశివచ్చును.

శేషం౮టిని ౧౨టిలోతీసివేయగా మిగిలినదిరలిప్తాదినితీసివేయగా భాగాది ౩-౨౦-౪౯దీనినివిలిప్తలుచాయగా ౧౨౦౪౯దీనివ్యర్కేందుగతి౬౦టభాగించగా ౧౧-౫౪దీనిని విలిప్తలుచాయ [illegible]దీనిచేభాగించగా ఘుడియవిఘుడియ ౧౫-౨౫ రాబడును. దీనిని అహస్సు౧౬-౧౭ యిందుకూడగా౩౪-౪౩ తిథిఘుడియలు రాబడును. యీప్రకారమే నక్షత్రముకు యోగముకుగతిని ౬౦టభాగించిన లిప్తవిలిప్తలుచాతభాగిస్తెను నక్షత్రఘుడియాది యోగఘుటికాది రాబడును.

## కరణసాధనము.

శ్లో॥ తిథిశ్చద్విగుణీకృత్యా గతమేకోపహారేద్ధ్రువం।
ఏష్యద్వ్యమునిభాగాశ్చ శేషంబవగణానితు।
పూర్వాపరతిథిస్యుక్తం తదర్ధంఘుటికాదిషు॥

ఆ॥ కరణముకు కావలసిన తిథినిద్విగుణించి గతతిథిఅయనా ఒకటితగ్గించేది. ఏష్యతిథిఅయనా౨తగ్గించేది. ౭టభాగించగా మిగిలినశేషముబవాదికరణమగును, ఆతిథిఘుడియలు పూర్వతిథిఘుడియలుకూడి సగంచేస్తెను కరణఘుడియలగును. ౬౦టికిహెచ్చుగావుండెనా ౬౦తోసివేసిమిగలావున్నది సగంచేసివేసేది. తిథిఘుడియలు అహస్సుకులోపుగావుండెనా ఆప్రకారమే కరణఘుడియలువేసేది.

శ్లో॥ కరణాన్యథకృష్ణేతు చతుర్దశ్యుత్తరేదళే।
శకునీదర్శపూర్వార్ధే చతుష్పాదుత్తరేదళే।
నాగవస్యాచ్ఛుక్లపక్షే కింస్తుఘ్నం ప్రతిపద్యతః॥

ఆ॥ చతుర్దశిఉత్తరార్ధమందు శకునికరణమున్ను, అమావాస్యయొక్క పూర్వార్ధమందు చతుష్పాత్కరణమున్ను, ఉత్తరార్ధమందు నాగవమున్ను, శుక్లప్రతిపత్తుయొక్కయూ, కింస్తుఘ్నమున్ను యివిస్థిరకరణాలు వీటికిగణితములేదు.

| | | | | | | శుక్లపక్షం. | | | | | కృష్ణపక్షం. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సం | పూ | ఉ | సం | పూ | ఉత్త | తిథి | రా | భా | కర | కర | తిథి | రా | భా | కర | కర |
| ౧ | కిం | బవ | ౧ | బా | కౌలువ | ౧ | ౦ | ౧౨ | కి | బ | ౧ | ౬ | ౧౨ | భా | కౌ |
| ౨ | బా | కౌ | ౨ | తై | గరజి | ౨ | ౦ | ౨౪ | బా | కౌ | ౨ | ౬ | ౨౪ | తై | గర |
| ౩ | తై | గ | ౩ | వగ | భద్ర | ౩ | ౧ | ౬ | తై | గ | ౩ | ౭ | ౬ | వన | భ |
| ౪ | వన | గ | ౪ | బవ | బాలువ | ౪ | ౧ | ౧౮ | వ | భ | ౪ | ౭ | ౧౮ | బవ | బా |
| ౫ | బవ | బా | ౫ | కౌ | తైతలు | ౫ | ౨ | ౦ | బ | బా | ౫ | ౮ | ౦ | కౌ | తై |
| ౬ | కౌ | తై | ౬ | గర | వగజి | ౬ | ౨ | ౧౨ | కౌ | తై | ౬ | ౮ | ౧౨ | గర | వన |
| ౭ | గర | వ | ౭ | భ | బవ | ౭ | ౨ | ౨౪ | గ | వ | ౭ | ౮ | ౨౪ | భ | బవ |
| ౮ | భ | బ | ౮ | బా | కౌలువ | ౮ | ౩ | ౬ | భ | బ | ౮ | ౯ | ౬ | బా | కౌ |
| ౯ | బా | కౌ | ౯ | తై | గరజి | ౯ | ౩ | ౧౮ | బా | కౌ | ౯ | ౯ | ౧౮ | తై | గర |
| ౧౦ | తై | గ | ౧౦ | వన | భద్ర | ౧౦ | ౪ | ౦ | తై | గ | ౧౦ | ౧౦ | ౦ | వన | భ |
| ౧౧ | వన | భ | ౧౧ | బవ | బాలువ | ౧౧ | ౪ | ౧౨ | వ | భ | ౧౧ | ౧౧ | ౧౨ | బవ | బా |
| ౧౨ | బవ | బా | ౧౨ | కౌ | తైతలు | ౧౨ | ౪ | ౨౪ | బ | బా | ౧౨ | ౧౦ | ౨౪ | కౌ | తై |
| ౧౩ | కౌ | తై | ౧౩ | గర | వనజి | ౧౩ | ౫ | ౬ | కౌ | తై | ౧౩ | ౧౧ | ౬ | గర | వన |
| ౧౪ | గర | వ | ౧౪ | భ | శకుని | ౧౪ | ౫ | ౧౮ | గ | వ | ౧౪ | ౧౧ | ౧౮ | భ | శకు |
| ౧౫ | భ | బ | ౩౦ | చ | నాగవం | ౧౫ | ౬ | ౦ | భ | బ | ౧౫ | ౧౨ | ౦ | చ | నా |
| | [illegible] | [illegible] | | [illegible] | [illegible] | | | | | | | | | | |

ఈప్రకారం వ్యకేంక్షందునుచూచి కరణములువేసుకోవచ్చును. ఈరాశ్యాదిసంఖ్యలకు సమానముగా వుండెనా ౧ సంఖ్యకరణములు. ధృవాలకు హెచ్చుగావుండెనా ౨సంఖ్యకరణములు.

## తిథినక్షత్రాదులు ఏష్యముతెచ్చుక్రమము.

శ్లో॥ ఖతర్కా స్తిథినక్షత్ర పరిమాణకలాహతాః ।
తద్యోగార్త్యావిభక్తేశ్చే దేష్యనాడీవినాడికాః॥

అ॥ తిథిపరిమాణము ౭౨౦న్ని నక్షత్రపరిమాణము ౮౦౦న్ను యోగపరిమాణము ౮౦౦న్ను ౬౦ంటగుణించి తిథికివ్యత్కేంద్రగతిచాతనున్ను నక్షత్రమునకుచంద్రగతిచాతనున్ను యోగమునకు సూర్యచంద్రగతులుకూడిన గతులుచాత భాగిస్తేను లబ్ధము ఏష్యఘటికాదులగును.



## తిథితప్పను.

శ్లో॥ యద్దినస్యతుపూర్వేద్యుః పరేద్యుఘటికాయుతం ।
తదర్ధంతద్దినంనాడ్యో తిథిరుక్తస్యయోగకే ॥

అ॥ తిథికినక్షత్రమునకు, యోగమునకు, పూర్వతిథిఘడియలు అపరతిథిఘడియలుకూడి సగంచేస్తేను మధ్యతిథియొక్క ఘటికాదులు నక్షత్రయోగఘటికాదులగును.

| విషధ్రువాల గుణకాలు. | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్విని-౫౦ | భరణి-౨౪ | కృత్తి-౩౦ | రోహి-౪౦ | మృగ-౧౪ | ఆర్ద్ర-౨౧ |
| ౪౦౦౦౦ | ౧౯౨౦౦ | ౨౪౦౦౦ | ౩౨౦౦౦ | ౧౧౨౦౦ | ౧౬౮౦౦ |
| పున-౩౦ | పుష్య-౨౦ | ఆశ్లే-౩౨ | మఖ-౩౦ | పుబ్బ-౨౦ | ఉత్త-౧౮ |
| ౨౪౦౦౦ | ౧౬౦౦౦ | ౨౫౬౦౦ | ౨౪౦౦౦ | ౧౬౦౦౦ | ౧౪౪౦౦ |
| హస్త-౨౧ | చిత్త-౨౦ | స్వాతి-౧౪ | విశాఖ-౧౪ | అనూ-౧౦ | జ్యేష్ఠ-౧౪ |
| ౧౬౮౦౦ | ౧౬౦౦౦ | ౧౧౨౦౦ | ౧౧౨౦౦ | ౮౦౦౦ | ౧౧౨౦౦ |
| మూల-౫౬ | పూ।షా-౨౪ | ఉ।షా-౨౦ | శ్రవ-౧౦ | ధనిష్ఠ-౧౦ | శత-౧౦ |
| ౪౪౮౦౦ | ౧౯౨౦౦ | ౧౬౦౦౦ | ౮౦౦౦ | ౮౦౦౦ | ౧౫౪౦౦ |
| పూ।బా౧౬ | ఉ।బా-౨౪ | రేవతి-౩౦ | | | |
| ౧౨౮౦౦ | ౧౯౨౦౦ | ౨౪౦౦౦ | | | |

## విషధువాలు.

శ్లో॥ మృగశ్లేషాస్వాతివైశాఖే జ్యేష్ఠే చైవచతుర్దశ౧౪ ।
కృత్తికామఖరేవత్యాం త్రింశద్దస్తుపునర్వసు౩౦ ।

శ్లో॥ అనూరాధాధనిష్ఠాచ శ్రవణందశమం౧౦తథా।
మూలాషప్పన్న౫౬మాశ్లేషాద్వాత్రింశ౩౨త్తాళరోహిణీర౦।
పూర్వాభాద్రంతుషోడశ్యాం౧౬ అశ్వన్యాంపన్న౫౦మేవచ।
ఆరుద్రహ స్తనక్షత్రే ఏకవింశతి౨౧నాడికాః।
ఉ త్తరాశతతారాచ అష్టాదశ౧౮మిదంశృణు।
భరణీచో త్తరాభాద్రా పూర్వాషాఢాత్రియష్టకం౨౪।
పుష్యేపుబ్బాచచిత్తాచ ఉ త్తరాషాఢవింశతిః॥ అర్ధస్పష్టం॥
విషధృవఃఖఖాష్టఘ్నా శశిభుక్తివిభాజితాః। నాడ్యాదికంతు
పూర్వర్క్షే యోజయేద్విషనాడికాః॥ .యింకొకపద్ధతి॥
ఖాంగాచ్ఛేద్యంపూర్వరుక్షం వ ర్తమానోడునాసహ।
విషప్రమాణనిఘ్నంతు షష్ట్యా ప్తంపూర్వతోపియుక్॥

తా॥ పూర్వనక్షత్రము ౬౦ట్లో శోధించి వ ర్తమాననక్షత్రముకూడితే నక్షత్రాద్యంతమగును. ఆనక్షత్రాద్యంతమును ఆనక్షత్రవిషప్రమాణ ఘడియలుచాత గుణించి ౬౦టభాగించివచ్చిన ఘటికాదిపూర్వనక్షత్రములో కూడేది.

శ్లో॥ షష్టిర్గతాచేద్దివసేప్రవ ర్తతే అహర్గతంచేన్నిశిపూర్వవాసరే।
ఖాంగశ్చాహ స్తునగతం పూర్వస్మిన్ దివ సేదివిరాత్రిరాత్ర్యాజ్యం
వేదయు క్తం నిశిత్య క్తవిశేషకం। నక్షత్రాద్యంతుతిథ్యంశం
త్యాజ్యమానంభ వేదిదం॥

తా॥ పూర్వనక్షత్రములో కూడిన మొ త్తములో ౬౦న్ని పోయినట్టాయెనా ఆదినమందు పగలున్ను అహస్సుపోయినా పూర్వరాత్రింన్ని ౬౦న్ని అహప్రమాణమున్ను పోయినట్టాయెనా ఆదినంరాత్రిన్ని త్యాజ్యమగును. ౬౦న్ని అహప్రమాణమున్ను పోకపాయెనా పూర్వరోజుదినమందు త్యాజ్యం. రాత్రిత్యాజ్యములో ౪ కూడి రాత్రిప్రమాణముతీశివేస్తేను శేషత్యాజ్యమగును. నక్షత్రాద్యంతమును౧౫కు భాగిస్తేను త్యాజ్యప్రమాణమగును.

అమృతధృవ సాధనము.

శ్లో॥ అశ్వనీవిష్టధృవో హీనతోమృతధృవస్యా విధోర్ధ్వవ స్తుస
ర్వధార్క౧౨సంయుతోభ వేత్।అసురేర్క౧౨శోధితేఖలేషు
శేషభేషువై సంభవంతివేదబాహు౨౪రసంయుతేషుధృవాః॥



తా॥ అశ్వని విషధృవంలో౫౦ తీసిన అశ్వనికిఅమృతధృవం. మృగశిరధృవములో౧౨కూడితే అమృతధృవం. మూలానక్షత్రములో ౧౨శోధించినఅమృతధృవమగును. కడమనక్షత్రాలకు ధృవాలులో౨౪కూడితేను అమృతధృవములగును.

వారత్యాజ్యం రాహుకాలము.

శ్లో॥ విధుస్సౌరిభృగుసుత జ్ఞజీవోభౌమభాస్కరాః।
త్రిపాదత్రీణివృద్ధిస్స్యా ద్రాహుకాలముదాహృతం॥

తా॥ సోమవారం౩౪ శనివారం౭౪ శుక్రవారం ౧౧। బుధవారం౧౪ గురువారం౧౮౪ మంగళ్వారం౨౨౪ ఆదివారం౨౬। యీవారములందుయీఘడియలమీదట ౪ఘడియలు రాహుకాలత్యాజ్యము.

లగ్నత్యాజ్యము.

శ్లో॥ అజవృషభధనుః కన్యకాదౌభుజంగః। ఝషమకరకుళీరే వృశ్చికాంతేచరాహుః। మిథునఘటతులానాం సింహమధ్యేతుగృధ్రః। సకలమునిమతంస్యా త్సర్వకార్యేషువర్జం॥

తా॥ మేష-వృషభ-ధనుః కన్యాలగ్నములకు మొదలఘడియ భుజంగమనేటిత్యాజ్యం. మిథున-కటక-వృశ్చిక-మకరలగ్నములకు ఆఖరునఆరఘడియ రాహుత్యాజ్యము. మిథున-కుంభ-తులా-సింహ్వాలగ్నములకు విష్లసగభాగమున గృధ్రమనేడిత్యాజ్యము సమ స్తకర్మలకుకూడదు.

ధృవసాధనము.

శ్లో॥ ఇష్టాపూర్వనవాంశకాదశ౧౦హతాత్ర్యాప్తాలవాద్యాధృవాః॥

తా॥ నక్షత్రగతపాదాలు౧౦టగుణించి ౩టభాగిస్తే ధృవభాగలగును. శేషం ౬౦టగుణించి ౩టభాగిస్తేలి ప్తలగును॥ ప్రత్యక్షం॥ మూలానక్షత్రతృతియ్య పాదమునకు గతపాదాలు౭౪న్ను ౧౦టగుణిస్తే ౭౪౦న్ని ౩టభాగిస్తే లబ్ధం ౨౪౬-౪౦ ఇదిరాశ్యాదిచేస్తే ౮పాదధృవం ౮-౬-౪౦-౦ రాబట్టను.

రవ్యాదిగ్రహములకు నక్షత్రపాద ప్రవేశానయనము.

శ్లో॥ ధృవస్యహీనం ఖచగేష్యమాణం గ్రహస్యహీనం ధృవయాతి
సాంజ్ఞా। తయోర్విలిప్తా స్వగతిర్విభక్తా వారాద్యహార్ధే
నగతైష్యయోజ్యం॥

తా॥ గ్రహము ధృవముకంటెతక్కువాయెనా ఏష్యప్రవేశము. గ్రహముధృవముకంటె యెక్కువాయెనాగతంగనుక ధృవములోగ్రహాన్ని కాని గ్రహంలో ధృవముకాని తీసివేసి ౬౦టగుణించి లి ప్తలుకూడి వారివారిస్ఫుటగతులుచాత భాగిస్తేను వారంవచ్చును. శేషం౬౦టగుణించి స్ఫుటగతిచాతభాగిస్తే ఘడియలు శేషం౬౦ట

గుణించిన గతిచాతభాగిస్తే విఘడియలు ఇవిఆహారర్థలో గతఏష్యము తెలిసి సంస్కరించేది. చారప్రవేశమగును.

శ్లో॥ భాగాదిఖచరస్త్రిశేఘ్నా ఖవేదార౦ ప్తస్తుభాదికః।
భగతస్తుఖవేదరంఘ్నా గుణా౩ప్తోరాశిసంజ్ఞకః॥
కార్త్తాంతికేంద్రంచంద్రస్యా ద్భారద్వాజసగోత్రిణా।
గోపాలకృష్ణసిద్ధాంతి స్ఫుటాధ్యాయోమయాకృతా॥

ఇతి బ్రంహ్మశ్రీ, మక్కపాటి. వెంకట్రమణసిద్ధాంతి సుబ్బరాయసిద్ధాంతి
ప్రియశిష్య, రాళ్లభండి. గోపాలకృష్ణసిద్ధాంతి విరచితే
గణరంజినీ స్ఫుటాధ్యాయ స్తృతీయ్యః.

---

# కుజాదులస్ఫుట,

## ప్రారంభః.

---

### శీఘ్రములు తెలిసేక్రమం.

శ్లో॥ కుజజీవశనినాంతు రవిశ్శీఘ్రోచ్చనామకం।
జ్ఞశుక్రయోర్మధ్యరవి గ్రహాతౌ శీఘ్రసంయుతౌ॥

అ॥ కుజగురుశనులకు సూర్యుడుశీఘ్రోచ్చానున్ను శుక్రబుధులకు సూర్యుడెమధ్యగ్రహామున్ను బుధశుక్రులు శీఘ్రోచ్చలున్నుఅగును.

### కేంద్ర సాధనము.

శ్లో॥ గ్రహాోనశ్శీఘ్రంచలకేంద్రనామకం షడ్భాదికంచక్రవిశోధితం
చ। మేషాదికేంద్రేధనజాభుజజ్యాతులాదిగేఅర్ణత్రిభోనకోటిః॥

అ॥ గ్రహమును శీఘ్రకేంద్రములో శోధించిన చలకేంద్రమునబడు ఆకేంద్రము మేషాది౬రాసులలోగా మేషాదికేంద్రంధనుభుజకేంద్రము ౬రాసులపైగా తులాదికేంద్రం యీ భుజజ్యఅని తెలిసి మాందభుజప్రకారము భుజసాధించి భుజరాశ్యాదిని ౩రాసులలోశోధిస్తే కోటియగును.

శ్లో॥ కేంద్రత్రిభాల్పేతుతదేవబాహూస్త్రిభోర్ధ్వకేచక్రదళాద్విశోధ్యం।
షడ్భాధికేషడ్రహితంభుజిస్యాన్నవాధికంచేద్భగణాద్విశోధ్యం॥



### అథజ్యాఖండాజీవనిర్ణయం.

శ్లో॥ జీవాస్స్యుర్ధాష్ట౮-౩౦ సప్తాంశా౭-౦।
యుగా౪-౦ లిప్తాస్థితాస్ఫుటాః॥

అ॥ కేంద్రము రాశిస్థానముసున్నావుండెనా ప్రథమజీవ౮-౩౦ కేంద్రము రాశిస్థానముఒకటివుండెనా రెండోజీవ౭-౦వున్నది. కేంద్రమురాశిస్థానం రెండు వుండెనా మూడోజీవయగు ౪-౦ యీప్రకారము ఆవశ్యమైనజీవనువుంచుకునేది.

### స్ఫుటజీవసాధనలక్షణం.

శ్లో॥ విభుక్తాంశాద్విగుణ్యాంశా శ్చతుఘ్నాంశశ్చఊనితేః॥

అ॥ కేంద్రమువలన ప్రథమ జీవఅయినపుడు భాగలు యన్నిఅగుచున్నవో ఆభాగలు ౧జీవయగు ౮-౩౦లోతీసిన మానసస్ఫుటజీవయగును. కేంద్రమువలన ౨జీవఅయినపుడు సప్తాంశాఅని౭-౦జీవయిచ్చి ద్విగుణ్యాంశశ్చఅనిరావి క్రిందిభాగలుద్విగుణించితీసివేస్తెను రెండోస్ఫుటజీవయగును. కేంద్రము ౩జీవసంభవించిన కాలమందు ౩జీవయగు ౪-౦లో కేంద్రభాగలు (చతుఘ్నాంశశ్చఊనితైః) అని క్రిందిభాగాదిశటగుణించి ౪-౦లో౧పుచ్చుకొని ౩-౬౦పెట్టుకొని దీనియందుతీసిన స్ఫుటజీవయగును. భుజకోట్లును జీవలుసాధించేది.

### భుజజ్యాకోటిజ్యాసాధనం.

శ్లో॥ జీవలిప్తవిలిప్తఘ్నాం భాగలిప్తచతుష్టృతిం।
మధ్యోజ్యం షష్టి౬౦షష్ట్యాప్తం షష్ట్యాప్తంక్రమశోన్వితం॥

అ॥ భుజకుగాని కోటికిగాని ఇష్టజీవనుసాధించి, కేంద్రముయొక్క భుజకోట్లనుసాధించుకొని భుజకోటులరాశిస్థానమువలన జీవచేసుకొని జీవభాగలిప్తవిలిప్తలను కోటిభాగలిప్తవిలిప్తలను చతుష్టృతిన్యాయానపెట్టుకొని వారివారి భాగలిప్తలచాతగుణించి ౬౦టభాగించిపైనకూడి మధ్యయుతంచేసి ౬౦టభాగించి భాగస్థానములోకూడి ౬౦టభాగించి రాసిస్థానమందున్న సంఖ్యయందుకూడేది.

శ్లో॥ రాశిస్థానంచశూన్యంచ్చే చ్ఛూన్యమేవవినిక్షిపేత్।
రాశిరేకంత్రిభిరుక్తం ద్వారాశౌపంచభిర్యుతా॥

అ॥ భుజరాశ్యాదిగాని. కోటిరాశ్యాదిగాని సున్నాఅయినకాలమందు వచ్చినఫలములోనే సున్నాకూడేది. రాశిరేకంత్రిభిర్యుక్తమని రాశిస్థానమందు ౧వుండెనా వకటిన్ని౩న్నుకూడితె నాల్గుఅయును. ఆనాల్గున్నుఫలమున్నువెరశి చేసుకునేది. (ద్వారాశౌపంచభిర్యుతం) అని రాశిస్థానమందు ౨వున్నప్పుడు ౫కూడగాయేడగును, యీ ౭న్ను రాశిస్థానసంఖ్యయందుకూడినదిఫలమున్ను మొత్తమగును.

### అథ ప్రక్షేపకము.

శ్లో॥ అథప్రక్షేపకంవక్ష్యే వికలాలిప్తసంయుతం।
కలాంశభాగసంయుక్తం రాశిభాగసమన్వితం।
సర్వంషష్ట్యావిభాగేన బుద్ధిమాంద్యవిచక్షణః॥

అ॥ రాశిని భాగలలోకూడేది భాగలనులిప్తలలోకూడేది లిప్తలనువిలిప్తలలోకూడి ౬౦టయెత్తివేస్తేను భుజజ్యకోటిజ్యలు అగును.

### అథకుజాదీనాం భుజాఫలసాధనార్థం మధ్యభేదము.

శ్లో॥ కుజమాందస్ఫుటభేదా షష్టి౬౦భాజితకర్ణయోః।
బుధస్యసర్వదారూప లోచనం౨౧శీఘ్రకర్ణయోః।
గురుమాందస్ఫుటభేదో యుగవేద౪౪హృతాఃఫలం।
వ్యాసోశుక్రస్యరుద్రాంశాః౧౧ శీఘ్రకర్ణముదాహృతం।
శనిమాందస్ఫుటభేదో షోడశాం౧౬భాజితాత్ఫలం।
లిప్తాదిభుజకోటిజ్యే సంస్కారేస్ఫుటకర్ణయోః॥

అ॥ కుజుని మాందస్ఫుటభేదమును ౬౦టభాగించగా లబ్ధం. లిప్తవిలిప్తలు కుజశీఘ్రకర్ణయగును. బుధునికి౨౧ శీఘ్రకర్ణబృహస్పతికి మాందస్ఫుటభేదమును ౪౪టుభాగించిన లబ్ధలిప్తాదిగురుశీఘ్రభేదం. శుక్రునికి౧౧లిప్తలుశీఘ్రభేదం. శనికి మాందస్ఫుటభేదము ౧౬టభాగించగా లిప్తాదిశనిశీఘ్రభేదమగును. యీశీఘ్రభేదములలోను భుజజ్యకోటిజ్య సంస్కారములుచేసిన స్ఫుటశీఘ్రభేదములు.

### శీఘ్రభేదానాం స్ఫుటీకరణము.

శ్లో॥ ఏతేకుజాదీనాంబాహుజాద్వ్యంశయుతాస్సర్వే।
కోటిజ్యాభిస్సహితా వియుతాస్తే స్ఫుటతరాఇమేచ్ఛేదాః॥

అ॥ కుజాది పంచగ్రహములకు భుజను రెండింటభాగించి భేదంలోకూడేది. కోటిజ్యను కూడడముగాని తీసివెయ్యడముగానిచేస్తే స్ఫుటభేదమగును॥

### కోటిజ్యాసంస్కారము.

శ్లో॥ ధనకోటిజ్యాచేద్యుతమృణకోటియదీహవియుతంస్యాత్।
ధనరుణాహ్వానమునిశంజ్ఞేయం కేంద్రాదోజయుగ్మసంస్థాశ్చ।
కుజబాహుజ్యాష్టాంశ యుతాఇమేస్ఫుటచ్ఛేదాః॥

అ॥ కోటిజ్యను కేంద్రము ౩రాసులలోగాధనకోటి. ౩పైన౬టివరకు రుణకోటి. ౬టికిపైన౯టివరకురుణకోటి. ౯టికిపైన౧౨రాసులవరకు ధనకోటి. ధనకోటి



అయిన భేదంలోకూడేది. రుణకోటిఅయినభేదంలోశోధిస్తే స్ఫుటశీఘ్రభేదమగును. కుజునికిమాత్రం భుజాఫలం౮టుభాగించగా లిప్తాదికూడేది. స్ఫుటభేదమగును.

### శీఘ్రభుజాఫలసంస్కారం.

శ్లో॥ లిప్తీకృతబాహుజ్యా స్ఫుటశీఘ్రభేదభాజేతేఫలం।
భాగాద్యంధనమృణమేష తులాదిస్థితానకేంద్రాచ్ఛని॥

అ॥ భుజజ్యభాగాదిని ౬౦ట గుణించి లిప్తలుకూడి తిరుగా ౬౦టగుణించి విలిప్తలుకూడి భేదం ౬౦టగుణించి విలిప్తలుకూడిన శీఘ్రభేదంచాతను భాగించగావచ్చినభాగాదిఫలం భుజాఫలమగును. ఆభుజాఫలము శీఘ్రకేంద్రము మేషాది అయినా మాందసంస్కారగ్రహములో కూడేది తులాదికేంద్రమాయనా మాంద సంస్కారగ్రహములో శోధించేది. స్ఫుటమగును.

### కుజాదీనాం శీఘ్రస్ఫుటగతిసాధనం.

శ్లో॥ వ్యాసంశీఘ్రఫలాంశార్కైః౧౨ భాగోనంగ్రహశీఘ్రయోః।
గత్యంతరఘ్నాచ్ఛేదాప్తం త్యక్త్వాశీఘ్రగతేగతిః।
యద్ధాఫలమనల్పంచె వక్రభుక్తిర్విపర్యయాత్॥

అ॥ శీఘ్రభుజాఫలం ౧౨టిపాలుగొన్నలబ్ధం మధ్యవ్యాసలోశోధించి తమ శీఘ్రగతిలోను మందస్ఫుటగతితీసిన కేంద్రగతియగును. శీఘ్రాకర్ణఫలంతీసినవ్యాసంచాతను చతుష్పరితిన్యాయానగుణించి తమతమ శీఘ్రభేదంచాత పాలుగొన్న లబ్ధం శీఘ్రగతిలోశోధిస్తేను స్ఫుటగతిఅవును. అటుగాకఫలంశీఘ్రగతికంటె అధికమాయనా ఆఫలంలో శీఘ్రగతితీస్తేను అదివక్రగతియగును.

### క్రాంతిసాధనము.

శ్లో॥ భుజజ్యాశాస్త్రతురగ౭౬ భాజితాలబ్ధమేనచ।
త్రిణ్యబ్ధియుగ౪౪౩హీనంతు జ్యాభక్తాంశాదిక్రాంతిషు॥

అ॥ భుజజ్యను ౭౬టిచాతభాగించినలబ్ధం. ౪౪౩ట్లోతీసివెయ్యగామిగిలిన శేషంచాతను భుజజ్యభాగిస్తేను అంశాదిక్రాంతియగును.

### విక్షేపసాధనము.

శ్లో॥ భుజజ్యాలోచనంరూప శూన్యేందు౧౦౧౨ భాజితాత్ఫలం।
లబ్ధమష్టాగ్ని౩౮శోధ్యంచ భుజహృత్కాలవిక్షిపం॥

అ॥ మాందభుజజ్య ౧౦౧౨టిచాతభాగించగా వచ్చినలబ్ధం ౩౮ట్లో తీసివేయగా మిగిలినశేషంచాతను భుజజ్యనుభాగించగా వచ్చినలిప్తాది చంద్రాదులకు విక్షేపమగును.

అ॥ కుజాదులస్ఫుటగతిసాధనం స్ఫుటాధ్యాయం చెప్పినప్రకారం వచ్చును.

శ్లో॥ కోటిభాగాదిరామేందు భక్తాభాగాదిజంఫలం॥

అని రెండుశ్లోకములచాతను స్ఫుటగతిసాధనము చెప్పియున్నాను, ఆప్రకారము యిక్కడ చేసుకొనవలయును. కుజాదులమాంద శీఘ్రసంస్కారముల రెంటిచాతనుస్ఫుటమగుచున్నారు.

శ్లో॥ తారాగ్రహార్కయోశ్శీఘ్ర శీఘ్రోచ్చమితరేగ్రహాః॥

అ॥ కుజగురుశనులకు సూర్యుడుశీఘ్రోచ్చ. బుధశుక్రునకుసూర్యుడు గ్రహంతమరె శీఘ్రోచ్చం॥

పూర్వమర్యాదను భుజకోట్లుఎరిగి సాధించుకొనుటకుముందు మందోచ్చలు తెలుపుచున్నాను.

శ్లో॥ నవరవయః౧౯౯ ఖరాకృతయః౨౨౦ ఖనగభువః౧౭౦ అసీతిరం అభ్రభజిగాః ౨౪౦॥

అ॥ ౮౪-౯-౦-౦ బు౬-౧౦-౦-౦ గు౫-౨౦-౦-౦ శు౨-౨౦-౦-౦ శ౮-౦-౦-౦ లోగడ కుజాదులస్ఫుటములోజీవఇచ్చి స్ఫుటములోచెప్పినప్రకారం ఇక్కడమాంద స్ఫుటము చేస్తున్నాను. పూర్వము చెప్పినప్రకారం. భుజకోట్లు సాధించుకునేది.

కుజజీవశనులకు వ్యాసాంశసాధనం.

శ్లో॥ కుజజీవశనిభేదా యుగెరగ్ని౩ నగతాహతాః । తిథి౧౫శ్శై లతుర్యఖ వ్యాసామూర్చనే౨-౦ శా ౧౧జ్ఞశుక్రయోః ॥

కుజాదులకు మధ్యభేదాలు.

శ్లో॥ శరవెదాఃరసఖఖేందవః౧౦౦ ద్వ్యంకాగ్నిఖదంతా౩౨౦ ఛేదాస్స్యుః త్రిరసా౬౩భేదాస్స్యుః కోటిసంస్కృతాః ॥

అ॥ కు౮౫ బు౧౦౦ గు౯౬ శు౩౨౦ శ౬౩ యీప్రకారంగము కుజాదులభేదాలలో వారివారి మందకోటిజ్యార్థము ధనమైనకూడెది రుణమైంతీస్తైను కుజాదులకు మాందస్ఫుటభేదాలు. సూర్యచంద్రులవలెనే మాందకర్మ కుజాదులకుచేస్తె మంద స్ఫుటగతులున్నఅగును.

కుజజీవశనులకు వ్యాసాలసాధనం.

శ్లో॥ కుజజీవశనిఛేధా యుగాగ్నినగతాహతాః॥

అ॥ అని కుజజీవశనిభేదాయుగారన్న ౩నగతాఽహతాఃఅని కుజునికి ౪టు గురుశుక్ర౩టశనికి౭టు వారివారిమాందస్ఫుటభేదాలుగుణించి తిథి౧౫శైల౭తుర్యఖ౪౦వ్యాసాఃఅని కుజునికి౧౫టువు గురువుకు౭టను శనికి౪౦టను భాగించవలెను. మూర్చనే౧౧జ్ఞశుక్రయోఅని బు౨౧శు౧౧.



అ॥ కుజజీవశనులకు వారివారి మందకోట్యర్ధ సంస్కృతభేదాలు అంగాగ కునికి౪టను గురువుకు౩టను శనికి౭టనుగుణించి కుజునికి౧౫టను గురువుకు౭టను శనికి౪౦టు పాలుగొన్నలబ్ధాలు వారివారివ్యాసాలగును. బు౨౧శు౧౧ ఇవివ్యాసాలు.

శ్లో॥ తద్దోస్త్రీంశయుతాశ్శీఘ్ర చేదాఃకోట్యర్ధసంస్కృతాః॥

అ॥ మాందస్ఫుటగ్రహములో తమతము శీఘ్రోచ్చలుతీసి, కేంద్రమెరిగి భుజకోట్లుసాధించి భుజజ్యకోటిజ్యలు తెచ్చుకొని వారివారిభుజజ్యను ౩౦టు పాలుగొనగా వచ్చినలబ్ధం వారివారివ్యాసాలలోకూడి తమతమకోటిజ్యను అంతానుధనమైతెకూడి రుణమైతేశోధిస్తేను వారివారిశీఘ్రభేదాలు అవును. (2) శీఘ్రభుజజ్యనుపూర్వమర్యాదను శీఘ్రఛేదాన పాలుగొనగావచ్చిన శీఘ్రభుజాఫలమవును. అది ధనరుణాలుమెరిగి మాందసంస్కారగ్రహములో సంస్కరిస్తేస్ఫుటమగును.

స్ఫుటగతిసాధనము.

శ్లో॥ వ్యాసంశ్శీఘ్రఫలాంశార్క౧౨ భాగోనం గ్రహశీఘ్రయోః । గత్యంతరఘ్నాఛేదాప్తం త్యక్త్వాశీఘ్రగతేర్గతిః ॥

ఆ॥ శీఘ్రభుజా ఫలము ౧౨టు పాలుగొనగా వచ్చినలబ్ధంతమతమ వ్యాసాలలోతీసి తమతమశీఘ్రగతిలోను మందసంస్కారగతితీసి దానినిశీఘ్రఫలం ౧౨టు పాలుగొన్నలబ్ధంతీసిన వ్యాసంచాత చతుష్పరిన్యాయానగుణించి మధ్యయుతం చేసిమానమెక్కించి తమతమ శీఘ్రంఛేదంచాతను పాలుగొన్నలబ్ధం తమశీఘ్రోచ్చగతిలోతీసివేస్తేను స్ఫుటగతియగును. ఫలం శీఘ్రగతికంటె అధికమాయెనా ఆఫలంలో శీఘ్రగతితీస్తేను ఆదివక్రగతియగును. దీనికి అంతరంకలను గనుక మరి వకవిధముగా స్ఫుటగతిని సాధించుచున్నాము.

శ్లో॥ మందగత్యూనితాశ్శీఘ్ర భుక్తావ్యాసహతాహృతాః ।
శీఘ్రచేదేనతల్లబ్ధం ఫలంభాగ్యోదళాహతా ।
చతుష్నంచనఖైరాప్తం త్యక్త్వాశీఘ్రగతేర్గతిః ।
యదాఫలమనల్పంచే ర్వక్రభుక్తిర్విపర్యయాత్ ॥

ఆ॥ మందస్ఫుటగతిని తమతమశీఘ్రగతిలోతీసి తమవ్యాసానగుణించి శీఘ్రఛేదంచాతను పాలుగొనగావచ్చినలబ్ధం శీఘ్రభుజాఫలం రాశ్యాదిచేసిజీవనువలెనె భోగ్యఖండంస్ఫుటంచేసి యీభోగ్యఖండంచాతను మునుపటిఫలం చతుష్పరితి

అ॥ తనఇష్టగ్రహమును మందోచ్చలో శోధించిన రాశ్యాదికము మాంద కేంద్రము తెలిశేది॥స్వకియ్యమయిన శీఘ్రోచ్చవల్లనుంచిన్ని ఇష్ట గ్రహమును శోధిస్తేను అది శీఘ్రకేంద్రమునజను మాందశీఘ్రకేంద్రములవల్లనుంచిన్ని ప్రతి రాశిత్రయంపాదము తెలిశేది అవి నాల్గుపాపములు అనగా ఓజయుగ్మక్రమము అది భుజఓజపాదమగుచుండగా కోటియుగ్మపాదము యప్పటికి ప్రథమతృతీయ్యాపాదములు భుజఅనిన్ని ద్వితియ్యచతుర్థపాదములు కోటిఅని తెలిశేది.

బుజకోట్లుసాధము.

శ్లో॥ త్రిభాధికేచక్రదళాద్విశోధితే షడూనితేచక్రదళాధికేసతి । సవాధికేస్మిం పతితేభమండలా ద్భుజీకృతం శేషముశంత్తితద్వధః॥

అ॥ కేంద్రము 3 రాసులలోపల ఆదె భుజ 3 రాసులకుపయిన ౬ రాసులలో శోధించిననది భుజ ౬ రాసులకుపయిన ౬ రాసుగే శోధించినది భుజ ౯ పైన ౧౨ రాసులలో తీసినది భుజ ను 3 రాసులలో శోధిస్తే కోటియగును.

భుజజ్యాసాధనం.

శ్లో॥ కలీకృతేతత్రశరాబ్ధిబాహుభిః ౨౨౫ హృతేగతజ్యాసుగణేన జాయడే । గతాగతజ్యాంతరనిఘ్న శేషకా । దిషుద్విదస్రా ౨౨౫ ప్తసమన్వితాస్మృతాః॥

అ॥ కేంద్రము భుజసాధించిరాశ్యాదిలిప్తలుచేసి ౨౨౫ ట భాగించిన లబ్ధం జీవయగును. ఆజీవయొక్క సంఖ్యను వ్రాసుకొని శేషలిప్తవిలిప్తలను ఆజీవయొక్క పైజీవయొక్క అంతరంచాత గుణించి ౨౨౫ ట భాగించిన లబ్ధలిప్తాదికమును మొదట వ్రాసుకున్న జీవయందుకూడితే అది భుజజ్యయగును.

భుజఫలజ్యవశాత్ఫలజ్యాసాధనం.

సూర్యచంద్రస్ఫుటం.

శ్లో॥ త్రిభి 3 న ౯ నైః ౭ సంగుణితైఖకుంజరైః ౮౦ స్వకేంద్రజీవేవిభజేత్ఫలంకలాః । తదూనయుక్తోస్ఫుటతామినోడుపా విశాస్వకేంద్రోజతులాదికక్రమాత్॥



అ॥ స్వదేశసూర్యుని సూర్యమాందమగు ౨।౧౮।౦।౦ యందు శోధించిన కేంద్రము భుజ సాధించి దానిని లిప్తాస్తత్వాయమై భర్తా అనే న్యాయంచాతను భుజజ్యను సాధించి ఆభుజజ్యను 3 ట గుణించి ౮౦ ట భాగించిన లబ్ధం లిప్తవిలిప్తలు కేంద్రము మేషాది అయితే ధనమున్ను తులాది అయితే ఋణమున్ను చేస్తే సూర్యస్ఫుటమగును.

చంద్రస్ఫుటమునకు.

శ్లో॥ గతింగ్రహస్యార్కఫలోథలిప్తికాహతాంహరేత్ఖాంబరభూపలోచనె ౨౧౬౦౦ ఫలంకలాద్యంతుభవేత్తదర్క ద్విధేయ మర్కాదిఖగేన్వృణంధనం.

అ॥ సూర్యబాహుభుజాఫలమును గ్రహములయొక్క గతులచాత గుణించి చక్రకలిప్తలగు ౨౧౬౦౦ ట భాగించిన కలాదిఫలము సూర్యునివలెనే కడమవారందరు గ్రహములయందు సంస్కరించేది.

చంద్రునియందు చంద్రోచ్యనుశోధించి కేంద్రమెరిగి భుజవలన భుజజ్యను సాధించి ఆభుజజ్యను ౭ట గుణించి ౮౦ట భాగించగా రాబడిన లబ్ధలిప్తాదికము కేంద్రము మేషాదిషట్కమయితే ఋణమున్ను తులాదిషట్కమయితే ధనమున్ను చేసేది.

స్ఫుటగతిసాధనంబు.

శ్లో॥ స్వభోగ్యఖండంక్షితిఖేందుభి ౧౦౧ హృతాంతరవేర్విధోర్ద్వి ౧౦ గుణితం సురో 33 ధృతం । తదూనయుక్తేభవతః స్ఫుటేగతిః క్రమాత్స్వకేంద్రేమృగకర్కటాదికే॥

అ॥ మాందోచ్యలో తీసిన కేంద్రభుజాంతరమును అనగా మొదట లిప్తాస్తత్వాయమై భర్తాఅనేన్యాయంచాతను ఏర్పడిన భుజయొక్క అంతరము సూర్యునకు ౧౦౧ చాత భాగించగాలిప్తాదిఫలమున్ను చంద్రునకు ఖండాంతరమును ౧౦ ట గుణించి 33 ట భాగించినలిప్తాదికక్యాదిమకరాదినిబట్టి మధ్యగతియందు అనగా కేంద్రము ఆద్యంతపాదములయందు మకరాది షట్కం గనుక శోధించేది ద్వితియ్యతృతియ్యపాదములయందు కటకాదిషట్కంగనుక మధ్యగతియందుకూడితే స్ఫుటగతియగును.

## అహస్సుతిధ్యాదులు పూర్వక్రమము.

శ్లో॥ వ్యర్కేందు లిప్తాభక్తాస్సుస్థిథయః ఖాశ్విపర్వతైః

అనే న్యాయంచాతను తిథినక్షత్రయోగకరణాదులు సాధించుకునేది.

ఒకానొకసమయమునందు వగసగా ౨ గాని ౩ గాని ఆరవైకింటికి పయి న క్రమమయిన ౧౧ విలిప్తలు గాక అధికం యన్నివచ్చినను ఆకాలమందు గత ంగాతిథులు తీసుకొనివచ్చి దానిలో అహర్గణము సంస్కరించి గతంగా వ్రాశేది.

ఆర్యభటమాందాలు॥ వస్విశా ౧౧౮ దశభాహవోం ౨౧౦ బరధృతిః ౧౮౦ ఖాంకా ౯౦ రసత్ర్యశ్వినో ౨౩౬ మాందాంశా ఇతి.

కు ౧౧౮ బు ౨౧౦ గు ౧౮౦ శు ౯౦ శ ౨౩౬ ఇవి కుజాదులకు మాందాంశలు.

ద్వితీయ్యార్యం॥ వస్వర్కా ౧౨౮ నఖభాహవో ౨౨౦ ద్వ్యగభువః ౧౭౨ ఖాష్టౌ ౮౦ వసుత్రస్విశ్వినో ౨౩౮ మాందాంశా ఇతి.

మ ౧౨౮ బు ౨౨౦ గు ౧౭౨ శు ౮౦ శ ౨౩౮ మాందాంశలు.

బ్రహ్మసిద్ధాంతే॥ భౌమాది తుంగ మాందాంశా నగార్కా ౧౨౭ ఖాశ్విదస్రకాః ౨౨౦ ఖాత్యష్టి ౧౭౦ ఖాష్ట ౮౦ ఖాద్వ్యశ్వి ౨౪౦ కేంద్రస్తుం గోనితేగ్రహే॥

మ ౧౨౭ బు ౨౨౦ గు ౧౭౦ శుక్రస్య ౮౦ శని ౨౪౦ మాందాంశలు.

## మాందపరిధిభాగలు.

శ్లో॥ మందాంశామను ౧౪ రగ్నిశైల ౭ యుగ ౪ గో ౯ సంఖ్యాస్స్వమాందాగుణాః॥

కుజునికి ౧౪ బుధస్య ౩ గురువుకు ౭ శుక్రస్య ౪ శనేః ౯ ఇవి ఓజమాందపరిధిభాగలు అగుచున్నవి.



శ్లో॥ భౌమస్య మందగుణకస్య చ అష్టచంద్ర ౧౮ బాణే ౫ ష్ట ౮ చ తస్రు ౨ శిఖి చంద్రమ యుగ్మ భాగాః॥

కుజస్య ౧౮ బుధస్య ౩ గురోః ౮ శుక్రస్య ౨ శనేః ౧౩ యుగ్మమాందపరిధిభాగలు.

## శీఘ్రగుణకాలు.

శ్లో॥ శైఘ్రారామశరా ౫౩ శశాంకదహనా ౩౧ భూపా ౧౬ నవాఖ్యాశ్వరాః ౫౯ నందాశ్చ ౯ క్షితిజజ్ఞజీవభృగుజాచ్ఛాయాసుతానాంక్రమాత్॥ ఓజాయుగ్మశశాంకపంచ ౫౧ నవనేత్రా ౨౯ ఋశశాంక ౧౫ నగాబాణా ౫౭ ష్టాక్షితి జజ్ఞజీవభృగుజాచ్ఛాయాసుతానాంక్రమాత్॥

అ॥ కుజాదులకు మాందగుణకాలు యుగ్మపరిధిభాగలు కు ౧౪ బు ౩ గు ౭ శు ౪ శనికి ౯ ఓజ పరిధిభాగలు ॥ కుజునికి ౧౮ బుధునికి ౫ గురువుకు ౮ శుక్రస్య ౨ శనేః ౧౩ కుజాదులకు శీఘ్రపరిధి ఓజాంతభాగలు ॥ కుజునికి ౫౩ బుధునికి ౩౧ గురువుకు ౧౬ శుక్రునికి ౫౯ శనికి ౯ ఓజాంతభాగలు కుజునికి ౫౧ బుధునికి ౨౯ గురువుకు ౧౫ శుక్రస్య ౫౭ శనేః ౮ యుగ్మాంతభాగలు.

మాందాంతరాలుకు ౪ బు ౨ గు ౧ శు ౨ శనికి ౪ ఇవి అంతరాలు. శీఘ్రాంతరాలుకు ౨ బు ౨ గు ౧ శుక్రస్య ౨ శనికి ౧ ఇవి అంతరాలు.

| కుజాదుల ఓజయుగ్మమంద పరిధి భాగలు తెలియుచక్రం. | | | కుజాదులకు ఓజయుగ్మ శీఘ్రపరిధిభాగలు తెలియజేయు చక్రం. | | |
|---|---|---|---|---|---|
| గ్రహముల యుగ్మ మంద పరిధిభాగలు. | ఓజయుగ్మాంతరం. | గ్రహముల ఓజ మంధపరిధి భాగలు. | కుజాదుల యుగ్మ శీఘ్రపరిధి భాగలు. | కుజాదుల ఓజశీఘ్రపరిధిభాగాది. | ఓజయుగ్మాంతరభాగాది. |
| కు ౧౮ | ౪ భా | కు ౧౪ | కు ౫౧ | కు ౫౩ | ౨ భాగలు |
| బు ౫ | ౨ భా | బు ౩ | బు ౨౯ | బు ౩౧ | ౨ భాగలు |
| గు ౮ | ౧ భా | గు ౭ | గు ౧౫ | గు ౧౬ | ౧ భాగలు |
| శు ౨ | ౨ భా | శుక్ర ౪ | శు ౫౭ | శు ౫౯ | ౨ భాగలు |
| శ ౧౩ | ౪ భా | శని ౯ | శ ౮ | శ ౯ | [illegible] |
| ర ౩ | ౦ | | | | |
| చ ౭ | ౦ | | | | |

## మాందశీఘ్రస్ఫుటపరిధులు చేయుక్రమము.

శ్లో॥ వేదా ౪ క్ష్మీందుయమాబ్ధయో ౪౧౨ ౪ మృదుభవాందో
ర్జ్యాంక్రమేణాహతా । వ్యాసార్ధే ౩౪౩౮ విభజేత్ఫలేఫల
యుక్తోహీనాష్టభృగోస్ఫుటందిద్వీందుద్వికుభిః ౪౨౧
౨౪ హార్యాంచలభవాందోర్జ్యాంభజేత్త్రిజ్యయా ౩౪
౩౮ సర్వేశ్శీఘ్రభవాఃఫలేసరహితాః స్పష్టాస్యురేవంగుణాః॥

అ॥ కుజాదిగ్రహములను మాందోచ్చలో శోధించి ఆమందకేంద్రమువల్ల భుజసాధించి భుజజ్యను తీసుకవచ్చి ఆభుజజ్యను కుజునికి ౪ట బుధునికి ౨ట బృహస్పతికి ౧ట శుక్రునికి ౨ట శనికి ౪ట వారివారి భుజజ్యను గుణించి వేరువేరుగా త్రిజ్యయగు ౩౪౩౮ ట భాగించగా వచ్చిన లబ్ధం స్వకీయ్యమయినటువంటికుజగురుశనులకు స్వమంద గుణకములయందు కూడటమున్ను బుధశుక్రులకు స్వమందగుణకములయందు శోధ్యమున్ను చేస్తేను స్ఫుటమాందగుణకములగును.

శీఘ్రవిషయమై॥ కుజాదులను శీఘ్రములో శోధించితే కేంద్రమగును ఆకేంద్రమువలన భుజకోట్లు సాధించి భుజజ్యను కోటిజ్యను సాధించునది.

ఆభుజజ్యను కుజునికి ౨ట బుధునికి ౨ట గురువుకు ౧ట శుక్రునకు ౨ట శనికి ౧ట గుణించి త్రిజ్యయగు ౩౪౩౮ ట భాగించిన లబ్ధం స్వకీయ్యమయిన శీఘ్రగుణకములయందు శోధిస్తేను స్ఫుటగుణకములగును.

### ముఖ్యాభిప్రాయం.

కుజునికి ౪ బుధునికి ౨ గురువుకు ౧ శుక్రునకు ౨ శనికి ౪ట భుజజ్యను గుణించి త్రిజ్యచాత భాగించిన లబ్ధం మందపరిధిభాగలను కుజునికి ౧౪ గు ౭ శని కి గ్రహలయందు కూడటమున్ను శుక్రునికి బుధులకు శోధిస్తేను స్ఫుటమాంద గుణకములగును.

శీఘ్రవిషయమయి॥ కుజాదులకు అనగా కు ౨ బు ౨ గు ౧ శు ౨ శని ౧ భుజజ్యనుగుణించి త్రిజ్యచాత భాగించిన ఫలం శీఘ్రపరిధులగు కు ౨౩ బు ౩౧ గు ౧౬ శు ౪౯ శ ౯ టి యందు శోధిస్తేను శీఘ్రస్ఫుటపరిధియగును.



## భుజజ్యాకోటిజ్యచలకర్ణ సాధనము.

శ్లో॥ దోర్జ్యావర్గవివర్జితత్రిభవనజ్యావర్గమూలంభవే - త్కోటి
జ్యాభుజభాగవర్జితనవత్యంశోన ౯౦ జీవాథవా స్వేష్టస్వ
స్వగుణాహతేఖవసుభిః ౮౦ దోఃకోటిజీవేహృతే । స్యా
తాందోఫలకోటిసంజ్ఞితఫలేతాభ్యాంశ్రుతింసాధయేత్॥

అ॥ త్రిజ్యావర్గమందు కేంద్రమువల్ల రాబడిన భుజాఫలవర్గమును తీసి మూలముకోటి జీవయగును. అట్లాకాకపోయినట్టయితే భుజను భాగలు చేసి ౯౦ ట్లో శోధించి జీవయినైను కోటిజీవయగును రెండుపద్ధతులు వకటేను. యిక్కను భుజజ్యకోటిజ్యలను స్ఫుటపరిధివృత్తములగు గుణకములచాత వేరువేరుగా గుణించి ౮౦ ట భాగించగా వచ్చినలబ్ధం వారివారియొక్క భుజజ్యాఫలమున్ను కోటిజ్యాఫలమున్ను అగును. ఆకోటిఫలము కేంద్రముయొక్క ఆద్యంత పాదములయందు త్రిజ్యయందుకూడ తగినది. మధ్యపాదములగు ద్వితియ్య తృతియ్య పాదములయందు శోధించతగినది. అనగా ౪ మొదలు ౯ వరకు రుణమున్ను ౯ మొదలు ౪ వరకు ధనంతూడేది. అది స్ఫుటకోటియగును. ఆకోటిజ్యావర్గమున్ను భుజాఫలవర్గమున్ను కూడి వర్గమూలంచేస్తేను మాందముకు మందకర్ణమున్ను శీఘ్రముకు శీఘ్రచలకర్ణమున్ను అగును.

### అందరుగ్రహములకు మాందస్ఫుటం.

శ్లో॥ మందోచ్చభావరహితగ్రహభాగమార్వ్యా । స్పంశోధ్యబా
హుఫలమర్ధధనుర్ధనేన । సంస్కృత్యమధ్యమమృణంసమ
వేత్సకేంద్రాత్సంశోధయేచ్ఛతమనష్టమతశ్చలోచ్చాత్॥

అ॥ సూర్యభుజాఫలసంస్కారమైనటువంటి మధ్యగ్రహములయందు స్వకీయ్యమైన మాందోచ్చనుశోధించిన మాంద్రకేంద్రమువల్ల భుజజ్యను సాధించి ఆభుజజ్యను స్ఫుటపరిధిచాత గుణించి ౮౦ ట భాగించగా వచ్చిన లబ్ధలిప్తాది మాందఫలముఅగును ౨౦౪ కి అధికమైనయడల ధనసంస్కారంచేశి మేషతులాది కేంద్రములవల్ల మేషాదిరుణం తులాదిధనం చేశేది.

శ్లో॥ శేషంభవేత్స్వచలకేంద్రభుజోభుజజ్యాం । కోట్యాంహ్వ
యాచవిదధీతతయోఃఫలేన । కోటీఫలేనరహితాన్విహితాత్త్రి
భజ్యా-కార్యాఫలేనమకరాది గజైశ్చభక్తా.

అ॥ వేరువేరుగాను గ్రహములను శీఘ్రములలో శోధించి - ఆశీఘ్ర కేంద్రము వల్లనుంచిన్ని పూర్వోక్తప్రకారము భుజజ్యను కోటిజ్యను సాధించి ఆభుజజ్యాకోటిజ్యలను శీఘ్రస్ఫుటపరిధి గుణకములచాత గుణించి ౩౬౦ ట భాగించిన లబ్ధం క్రమముగా భుజాఫలమున్ను కోటిజ్యాఫలమున్ను అగును. ఆకోటిజ్యాఫలము కేంద్రముయొక్క ఆద్యంత పాదములయందు త్రిజ్యయందు కూడేది మధ్యపాదములయిన ౨-౩ పాదములయందు శోధించటమున గా. కర్కాది మకరాదులనుబట్టి త్రిజ్యలో సంస్కరిస్తె శుద్ధకోటియాగును.

శ్లో॥ తద్వర్గబాహుఫలవర్గసమానమూలంకర్ణో భ వేద్భుజఫలంగుణితంత్రిజ్యార్వ్యాం । కర్ణోద్ధృతంకృతధనుశ్ఫలమాశుసంజ్ఞం । స్యాత్తద్ధనంస్వమథమర్థమనష్టసంజ్ఞే॥ కార్యంక్రియాద్యథతులాద్యనగంస్య కేంద్రం ప్రాగ్వత్తతో మృణఫలం సకలంవిధేయం । మధ్యేపునశ్చలఫలేన-తతోఖిలేన ప్రాగ్వత్త్వసంస్కృతతనుశ్స్ఫుటతాముపైతి॥

అ॥ ఆశుద్ధకోటివర్గమున్ను భుజాఫలవర్గమున్ను రెండున్ను కూడి వర్గమూలంచేస్తెను చలకర్ణయగును, భుజాఫలమును త్రిజ్యచాతగుణించి శీఘ్రచలసంబంధమయిన చలకర్ణచాతను భాగించగా రాబడిన భుజాఫలజ్యకు ౨౨౫టికి చాపంచేయగా నిధనుశ్శీఘ్రసంస్కారంచేసి అర్ధంచేసి మేషాది కేంద్రమయిన ధనమున్ను తులాది కేంద్రమయిన ఋణమున్నా చాయతగ్గది.

ఆగ్రహమందయ్యేవే స్వకీయ్యమైన మాందోచ్చమశోధించి ఆమంద కేంద్రమువలన పూర్వోక్తప్రకారము మాందఫలమును సాధించి దానికి ధనుసంస్కారంచేసి ఆమాందఫలలిప్తాదికమును సకలమున్ను ౩ సంస్కారంగనుక మొదటి మధ్యగ్రహమందు పూర్వమువలెనే మేషతులాదులయందు ఋణధనములుగా సంస్కరిస్తెను తృతీయ్యమాందసంస్కారగ్రహముగును.

ఆమాంద్యస్ఫుటగ్రహమును తమతమ స్ఫుట శీఘ్రములలో శోధించి శీఘ్ర కేంద్రం వల్లనుంచిన్ని పూర్వమువలెనే తేబడిన శీఘ్రఫలమును ధనుస్సంస్కారంచేసిన లిప్తాదికమును సకలమున్ను మందస్ఫుటగ్రహయందు మేషతులాది లెకంగ సంస్కరించితే చాశ్ఫుటంచాయబడిన స్ఫుటగ్రహముగును. యీప్రకారం కుజాదులకుస్ఫుటము.



శ్లో॥ శీఘ్రఫలేనదళితేనఫలేనపూర్వం । సంస్కృత్యఖేచరమశోవిదధీతమాందం - తేనాఖిలేనసకలేనచశీఘ్రజేనప్రాగ్వస్ఫుటీభవతి సంస్కృతవారగ్రహస్యః॥

అ। గ్రహంసంశోధ్యంచాయబడిన శీఘ్రకేంద్రమువల్ల రాబడిన శీఘ్రఫలములో సఖము మధ్యగ్రహమందు సంస్కరించవలసినట్లున్ను తదుపరి గ్రహములో మాందోచ్చను శోధించి ఆమందఫలార్ధము సంస్కరించి తిరుగా మందోచ్చను శోధించి ఆకేంద్రమువలన రాబడిన మందఫలమయావత్తున్ను మొదటిమధ్యగ్రహమందు సంస్కరిస్తె మాందస్ఫుటగ్రహమగును ఆస్ఫుటగ్రహమును స్వశీఘ్రంలో శోధించి ఆశీఘ్ర కేంద్రంవల్ల రాబడిన సకల శీఘ్రఫలమున్ను, మందస్ఫుటగ్రహమందు సంస్కరిస్తెను స్ఫుటగ్రహములగుచున్నారు,

## మాందస్ఫుటగలలుసాధనము.

శ్లో॥ జ్యాఖండకేనగుణితామృదుకేంద్రజేనభుక్తిగ్రహస్యదళయుగ్మయమైౖ ౨౨౫ విభక్తాత్తుంణాంస్ఫుటేన గుణకేనహృతాఖనాగైః ౩౬౦ లిప్తాగతిఃఫల॥

అ॥ స్వకీయ్యమయిన మాంద్ర కేంద్రభుజయొక్క అంతరమును ఆగ్రహగతులచాత గుణించి ౨౨౫ ట భాగించగా వచ్చినలబ్ధమును మాందస్ఫుటపరిధిగుణకములచాత గుణించి ౩౬౦ ట భాగించగా వచ్చిన విప్తాదిఫలము ౬౦ ట భాగిస్తే కలాదిఫలము గతిఫలమగును. కేంద్రంయొక్క ఆద్యంత పాదములయందు మధ్యగతియందు శోధ్యమున్ను మధ్యపాదములయందు స్వభుక్తియందు యోజ్యమున్నుచేస్తె స్ఫుటమాందగతియగును.

## శీఘ్రస్ఫుటగతిసాధనంబు.

శ్లో॥ తద్వర్జితాస్వచలతుంగగతిస్వభోగ్యఖండాహతాశరయమాశ్వి ౨౨౫ హృతాహతాచ స్వేదస్ఫుటేనగుణకేనఖనాగభక్తాత్రిజ్యాహతాశ్రుతిహృతాచలకేంద్రవ్యాప్తాత్॥

అ॥ మందఫలసంస్కృతస్ఫుటమాంద భుక్తిస్వకీయ్యమయిన శీఘ్రభుక్తిలో శోధిస్తె కేంద్రగతియగును. ఆ కేంద్రగతిని స్వకీయ్యమయిన శీఘ్ర కేంద్రభుజజ్యా

కర్ణంచాత గుణించి ౨౨౫ ట భాగించిన లబ్ధమును స్వకీయ్యామయిన స్ఫుటగుణక ముఖచాత గుణించి ౨౦ ట భాగించిన లబ్ధమును తిరుగా త్రిజ్యాచాత గుణించి స్వకీయ్యామయిన చలకర్ణచాతను భాగిస్తే లబ్ధప్రాదికము శీఘ్రఫలమగును యీ ఫలము ౧-౪ పాదములయందు ధనమున్ను మధ్య పాదములయందు ఋణమున్ను చేశేది.

## ధనుసంస్కారంచేయుక్రమము.

శ్లో॥ విశోధ్యజీవాశరదృక్కరా ౨౨౫ హతేహృతా వశేషేవివ
ర్త్యేజీవయోః। విశుద్ధజీవాచహతేచసంఖ్యయాశరద్విదస్రే
౨౨౫సహితే ధనుర్భవేత్॥

అ॥ భుజాఫలలిప్తలు ౨౨౫ టికి హెచ్చైయుండిన ధనుసంస్కారం చాయవలెను ఎట్లనగా పోయినజీవను తీసివేసి శేషమును ౨౨౫ ట గుణించి పోయినజీవయొక్కనున్ను ఆపైజీవయొక్కనున్ను అంతరంచాతను భాగించగా వచ్చినలిప్తాదిఫలము మొదటయెన్నోది ౨౪ జీవలలో పోతుందో ఆజీవ సంఖ్యను ౨౨౫ ట గుణించి కలాదిఫలముకూడితే ధనుఃసంస్కారమగును.

## ప్రత్యక్షం.

౪౫౦ భుజాఫలము వచ్చినకాలమందు ౨ జీవ ౪౪౯ పోతే నిల్వశేషం ౧ విపలున్ను విలిప్తలు ౨ న్ను శేషములు ౨౨౫ ట గుణించితే ౨౨౫ ను ౨౩౨। ౩౦ న్ని ఆజీవాంతరమును ౨౩౨ ట భాగించిన కలాది ౧-౨ న్ను ౨ జీవపోయినది గనుక ౨౨౫ న్ను ౨ టి గుణించగా ౪౫౦।౦ అందులో కలాదిఫలము ౧।౨ కూడగా ధనుసంస్కారభుజాఫలము ౪౫౧।౨ యీఫలము గ్రహములో సంస్కరించేది.

## ముఖ్యాభిప్రాయంకుజాదులకు

మొదటను యీశాస్త్రోక్తప్రకారమమాంబాధకసంస్కారమున్ను రెండవ శ్యాయం శీఘ్రార్ధసంస్కారమున్ను తృతీయమాందఫలము యావత్తు మొదటి మధ్యగ్రహమునకు సంస్కారమున్ను నాల్గవది శీఘ్రఫలసంస్కారమున్ను చేయవలసినట్టు ఆర్యభట్టాచార్యాభిప్రాయం ఆప్రకారమే చాయటమే ముఖ్యాంశముగా తోస్తున్నది॥



శ్లో॥ మాందార్ధంమధ్యమేకుర్యా। త్తథాశీఘ్రార్ధమేవచ మ
ధ్యగ్రహోమందఫలం। సకలంశీఘ్రమేవచ॥

## సూక్ష్మమధ్యాధికారము.

శ్లో॥ యచ్ఛాస్త్రం సవితాచకార విపులంస్కంధైస్త్రిభిర్జ్యోతి
షం - తస్యచ్ఛిత్తిభయాత్పునః కలియుగే సంస్కృత్యయో
భూతలం। భూయఃస్వల్పతరం - వరాహమిహిరో - వ్యా
ఖ్యాంతుసర్వావ్యథా - దిత్థంయత్ప్రవదంతియోగకుశలా।
స్తస్మైనమోభాస్వతే॥

నతింకృత్వాగణేశాయ। విఘ్నవిధ్వంసకారిణే। నిర్విఘ్న
కృతిసాధాయ। కమలాపతయేనమః॥

అవ్యక్తమవ్యయంశాంతం। నితాంతంయోగినాంప్రియం।
సర్వానందస్వరూపంయ। తత్వందేబ్రహ్మసర్వగం॥

మోహాంధకారమగ్నానాం। జనానాంజ్ఞానరశ్మిభిః। కృత
ముద్ధరణయేన। తంనౌమిశివభాస్కరం॥

పూర్వాచార్యమతేభ్యో। యద్యచ్ఛ్రేష్ఠంలఘుస్ఫుటంబీజం।
తద్బుద్ధిదంశుభకరం। రహస్యమభ్యుద్యతేవక్తుం॥

## కల్పాదద్యుగణసాధనం.

శ్లో॥ కల్పాబ్దోకర్ణ ౧౨ గుణోమాసయుక్త్రిస్థరసాబ్ధి ౪౬ యుక్
శూన్యాద్రిలబ్ధమను యుక్స్వరలబ్ధోధిమాసయుక్ ఖత్రి ౩౦
ఘ్నంతిథియుక్తోధరుద్రఘ్నంపంక్తిఖాద్రిభిః ౭౦౩ లబ్ధక్షయ
విశోధ్యంచశుక్రవారాదికం దినం వర్జయేద్వర్ధయేదేకంవా
రోనాయాతిచేతసః॥

అ॥ యీశ్లోకార్ధము ప్రథమాధ్యాయములో వున్నది అయితే ౨ భేదములు కలవు ౧ కల్పాబ్దాలు ౧౨ ట గుణించమనిన్ని ౨ పద్మాలుమాడకనే అధిమాసములు రావటం ఇవి భేదము.

## మధ్యగ్రహసాధనము.

### సూర్యస్య.

శ్లో॥ అహర్గణః ఖాద్రి ౭౦ లవేనవర్జితః । ఖరాంశురంశాదిర
యంప్రజాయతే । అహర్గణాల్లోచన ౨ సంగుణాశ్శరైః ౫
హృతావిలిప్తాదిఫలేనవర్జితః॥

ఆ॥ ద్యుగణమును రెండుప్రతులుగావుంచి ౭౦ టి భాగించగా రాబడిన భాగాదిని ద్యుగణములో శోధించేది తిరుగా ద్యుగణమును ౨ ట గుణించి ౫ ట భాగించగా రాబడిన విలిప్తలు ఋణముచేసి భాగలు ౩౦ ట భాగిస్తే రాశ్యాదిసూర్యుడు రాబడును.

### చంద్రస్య.

శ్లో॥ చంద్రగ్రహేవిశ్వసమాహతాద్ద్యుధా వేదాచలా ౭౪ ద్యుభక్తే
లవేషుదద్యాత్ । స్వఖాభ్ర ౧౩ చంద్రాంకశశిర్ద్విభాజితే
కలాదినిహారకర్త్రప్రసిద్ధయే॥

ఆ॥ ద్యుగణమును ౧౩ ట గుణించి రెండుప్రతులుగావుంచి వకప్రతి ౭౪ట భాగించిన భాగాదిన్ని రెండోప్రతిని ౧౯౧౫౦ ట భాగించిన భాగాదిన్ని ౧౩ గుణించిన ద్యుగణములో కూడితేను భాగాదిచంద్రుడగును.

### కుజసాధము.

శ్లో॥ కుజధ్రువేదస్ర ౨ హృతంద్యుసంచయంలవేషురూపాక్షి ౨౧
లవేనసంయుతం । క్షిపేద్ద్యుపిండాద్గగనేభ ౮౦ భాజితా
త్కలాదిలబ్ధంచభవేన్మహీసుతః॥

ఆ॥ ద్యుగణమును ౨ ట భాగించి రెండుప్రతులుగావుంచి క్రిందిప్రతిని ౨౧టి భాగించగా రాబడినభాగాదిని కూడేది. ద్యుగణమును ౮౦ ట భాగించగా రాబడిన లిప్తాదికమును కూడితే భాగాదిమధ్యకుజుడగును.

### బుధశీఘ్రసాధము.

శ్లో॥ ద్విఘ్నేదినౌఘేభాగచతుష్టయంక్షిపేచ్చరత్నైర్భిః ౬౫ షట్చబుధ
ధ్రువేచలం॥



ఆ॥ ద్యుగణమును ౪ ట గుణిస్తే భాగాదియగును. తిరుగా ద్యుగణమును ౬ ట గుణించి ౬౫ ట భాగించగా రాబడిన భాగాదిఫలం ౪ ట గుణించిన భాగాదిలో కూడితేను బుధశీఘ్రోచ్చయగును.

### బృహస్పతిసాధనము.

శ్లో॥ శర ౫ ఘ్నమబ్ధ్యక్షగుణాంశ ౩౫౪ వర్జితంకలాదిజీవధ్రువ
కే దినాదికం॥

ఆ॥ ద్యుగణమును ౫ ట గుణించి రెండుప్రతులుగావుంచి క్రిందిప్రతిని ౩౫౪ ట భాగించగా రాబడిన కలాదిఫలముపై ప్రతిలో శోధిస్తేను కలాది బృహస్పతియగును,

### శుక్రశీఘ్రోచ్చసాధము.

శ్లో॥ అహర్గణఃకుంజర ౮ తాడితఃపృథక్శరైః ౫ ద్విషష్ట్యా
౬౨ చహృతాంశలిప్తికాః । సితస్యశీఘ్రోచ్చసముద్భవేన
క్రమేణదేయాసిత శీఘ్రసిద్ధయే॥

ఆ॥ ద్యుగణమును ౮ ట గుణించి రెండుప్రతులుగావుంచి ౫ టభాగించగా రాబడిన భాగాదిఫలమున్ను రెండోప్రతి ౬౨ ట భాగించగా రాబడిన లిప్తాది ఫలమును యివి రెండుకూడితేను శుక్రశీఘ్రోచ్చయగును.

### శనిసాధనం.

శ్లో॥ కలాద్వయఘ్నంద్యుగణంశనిధ్రువే శరేందురామాంశ ౩౧౫
యుతంవినిక్షిపేత్ ॥

ఆ॥ ద్యుగణమును ౨ ట గుణించి రెండుప్రతులుగావుంచి క్రిందిప్రతి ౩౧౫ ట భాగించగా రాబడిన లిప్తాది పై ప్రతిలోకూడితేను లిప్తాదిగా శనియగును.

### ఉచ్చకు.

శ్లో॥ నవోద్ధృతా ౯ రూపరసైః ౬౧ ధృతాస్తథాంశశాంకతుంగే
ద్యుగణేంశలిప్తికాః॥

ఆ॥ ద్యుగణమును ౯ ట భాగించగా రాబడిన భాగాదిఫలమున్ను ద్యుగణమును ౬౧ ట భాగించగా రాబడిన కలాదిఫలమున్ను యివి రెండు కూడితేను భాగాదిచంద్రోచ్చయగును.

## రాహుసాధనం.

శ్లో॥ నవేందు ౧౯ భక్తావసువేద ౪౮ భాజితాస్తమోధ్యవే భాగ
కలాదినిక్షిపేత్ - శశాంకతంగేభవనత్రయం ౩ క్షిపేతమ
స్స్వషడ్భం ౬ భగణాద్విశోధయేత్ ॥

అ॥ ద్యుగణమును ౧౯ టిచాత భాగించగా వచ్చిన భాగాదిఫలమును
ద్యుగణమును ౪౮ టి భాగించగా వచ్చిన కలాదిఫలమున్ను యీవి రెండున్ను కూ
డితేను రాహువు యగును చంద్రోచ్చయందు ౩ రాసులుకూడితేగాని చంద్రోచ్చ సరి
పడదు రాహువుయందు ౬ రాసులుకూడి చక్రశోధనం జేస్తేనే కాని రాహువు సరిప
డదుగనుక తెలిసేది.

ఈ ప్రకారము మధ్యగ్రహముల సిద్ధపరుచుకొనవలెను.

పూర్వము చెప్పినప్రకారము దృక్సిద్ధము కాగలందులకు కల్యాదిసంస్కార
మున్ను దృక్సంస్కారమున్ను దేశాంతరసంస్కారమున్ను భుజాఫలసంస్కారము
న్ను చేసి స్ఫుటము చాయావలయు ఆర్యభటసిద్ధాంత తుల్యమధ్యగ్రహములగుదురు.

## కల్యాదిసంస్కారము.

శ్లో॥ గోనైకగుణయుక్తాకది ౧౦ గ్గుణాభాస్కరాదితః । ద్వ్యా
ఘ్నాంగాంకై ౯౬౫౨ ఖనందాంగైః ౬౯౦ రబ్ధితత్త్వైః
౨౫౪ కుపంచభిః ౫౧ గజాంకాబ్ధిభి ౪౯౮ రగ్న్యష్ట
౧౬౩ ఖఖాష్టైః ౫౦౦ శృతఖేందుభిః ౧౦౪ ఖేంద్రైః
౧౪౦రాప్తంవిధూచ్చస్యలిప్తాద్యంసూర్యసమ్మతం । జ్ఞశీఘ్రా
కజభామేషుయుంజ్యాదం న్యేషుశోధయేత్ ॥ భచక్రాదధి
కంయాంతి చక్రాద్విగుణశోధితే॥

అ॥ కల్యాదిని ౧౦ టి గుణించి ర ౯౬౫౨ చ ౬౯౦ కు ౨౫౪ బు ౫౧ గు
౪౯౮ శుక్ర ౧౬౩ శనైః ౫౦౦ రాహు ౧౦౪ చంద్రోచ్చకు ౧౪౦ టి భాగిం
చగా వచ్చిన కలాదిఫలము రవి చంద్ర చంద్రోచ్చ గురు శుక్ర శీఘ్ర రాహువుల
యందు శోధించేది. కుజబుధ శీఘ్ర శనియందు కూడేది. యీసంస్కారంచేస్తేను
సూర్యసిద్ధాంత తుల్యముగు చున్నారు.

## దృక్సంస్కారము.

శ్లో॥ కల్యాద్యబ్దాఃఖఖరసగుణా ౩౬౦౦ భాజయేచ్ఛేషసంఖ్యా



జ్ఞాత్వాశేషం ఖఖగజకుతః ౧౮౦౦ స్వల్పసంఖ్యాయదిస్యా-
త్తస్మాదస్మాదధికమిహచేషష్టికృత్యో ౩౬౦౦ నితంతచ్ఛేషం
ప్రాజ్ఞైఃఖచరగుణకై స్తాడయేద్వ్యత్యమాణైః॥

అ॥ అనేశ్లోకమును ప్రథమాధ్యాయంలో అర్థంవ్రాసియున్నాము అది చూ
చుకునేది.

## గుణకములు హారము ఆర్యభటసిద్ధాంత ప్రకారముచేసేది.

శ్లో॥ శాకేనఖాబ్ధిరహితే శశినోక్షదస్రైః ౨౫ ।స్తత్తుంగతః
కృతశివై ౧౧౪ స్తమసషడంకైః ౯౬ శైలాబ్ధిభిస్సుర
గురోః ౪౭ గుణితేసితోచ్చ శోధ్యంత్రిపంచకుభిః ౧౫౩ అ
ర్భశరాక్షిభక్త ౨౫౦ స్తంభేరమాంబుధి ౪౮ హతేక్షితి
నందనస్య - సూర్యాత్మజస్యగుణితాం వసునీరధిస్వం ౪౮
వ్యోమాగ్ని వేద ౪౩౦ నిహతేవిదధీతలబ్ధం।శీతాంశుసూను
చలతుంగకలాసువిద్భిః॥

ఆర్యభటమందు తొమ్మిది వేలకు పైగా కల్యాది అయినకాలమందు యీద
ృక్సంస్కారమందే యింకొకసంస్కారముచేసి దృక్సంస్కారం చాయావలసినట్టు చె
ప్పియున్నారు ఆవిషయంవెనక చెప్పినదానియందు చూచుకుంటే తెలుసును.

## దేశాంతరసంస్కారం.

శ్లో॥ గత్యధ్వయోజనాహాన్యావిలిప్తాఖాష్ట ౮౦ హృత్యజేత్ ॥

అ॥ మధ్యగతి అధ్వయోజనాలగు ౪౦ టి గుణించి ౮౦ టి భాగించగా
వచ్చిన కలాదిఫలము మనము ప్రాగ్భాగమందున్నందున తీసేది,

## భుజాఫలసంస్కారం.

శ్లో॥ పంచతుర్రామై ౩౬౫ ర్మునినేత్రయోశ్చ ౨౭ శైలాష్టత
కైశ్చ॥

అని వెనక చెప్పియున్నాను ఆప్రకారం చేసుకొనేది.

## అయనాంశసాధనం.

శ్లో॥ త్రిఘ్నాః౩ కలిగతాబ్దాఖశి।ఖనఖా ౨౦౦ ప్తాం శకాఃఫలం
వేదార్ధాప్తానశేషైద్వే । తయోరల్పంచలాంశకాః॥

అ॥ కల్యాదిగతాబ్దాలను 3 ట గుణించి ౨౦౦ ట భాగించగా వచ్చినభాగాద్యిఫలమును భాగలను మాత్రం ౫౪ ట భాగించిన శేషము భాగలున్న శేషం లిప్తవిలిప్తలు పూర్వమే వచ్చియున్నవి.

అహస్సుపూర్వప్రకారమే సాధించుకువేది.

---

## సూక్ష్మస్ఫుటాధ్యాయప్రారంభము.

శ్లో॥ భౌమాదితుంగమాందాంశా నగార్కా ౧౨౭ ఖాశ్వీదస్రకాః ౨౨౦ ఖాత్యష్టి ౧౭౦ ఖాష్ట ౮౦ ఖాబ్ధ్యశ్వి ౨౪౦ కేంద్రస్తుం గోనితేగ్రహే॥

అ॥ కుజునకు ౪।౭।౦।౦ బుధునికి ౭।౧౦।౦।౦ గురువుకు ౫।౨౦।౦।౦ శుక్రునకు ౨।౨౦।౦।౦ శనికి ౮।౦।౦।౦ మాందాలు.

గణకానందములో చెప్పినప్రకారము శైలెందుబాణై ౫౧౭.

అని మాందములలో యీసంస్కారం చాయటం ముఖ్యాంశమయినట్టు తోస్తున్నది. అందువల్ల విశేషంతేడాలేదు.

### మాందస్ఫుటీకరణము

నిమిత్తమయి ముందు ఛేదములు చెపుతున్నాను.

శ్లో॥ మందఛేదాస్త్రిషడ్దస్రా ౨౬౩ గతీశా ౧౧౪ శ్చంద్రసాయకాః ౫౧ గజార్కా ౧౨౮ రవిచంద్రాశ్చ ౧౧౨ త్రిషడ్దస్రా ౨౬౩ శ్శరాచలాః ౭౫ మాందదోర్జ్యాం దశా ౧౦ భ్యస్తాస్స్వఛేదాప్తాః కలాఫలం। స్వర్ణం కేంద్రతులాజాద్యే - తేనార్కేందూస్ఫుటాతయోః॥

అ॥ భుజజ్యను సాధించుకొని ఆభుజజ్యను ౧౦ ట గుణించి సూర్యునికి ౨౬౩ ట చంద్రునకు ౧౧౪ ట, కుజునకు ౫౧ ట బుధునకు ౧౨౮ ట బృహస్పతికి ౧౧౨ ట శుక్రునకు ౨౬౩ ట శనికి ౭౫ ట భాగించగా వచ్చిన మాందఫలమును సంస్కరిస్తేను సూర్యచంద్రులు స్ఫుటమవుదురు. కుజాదులకు మాందసంస్కారం యీప్రకారమేకాని అయితే చాక్షుస్ఫుటం కలదుగనుక ఆవశ్యకమయినచోట యీసంస్కారం చేశేది.



### అందరికి మాందగతులసాధనము.

శ్లో॥ దోర్జ్యాంతరగుణాభుక్తిః । తత్వదస్రోద్ధృతాః పునశ్ఛిన్నా ౧౦ ఛేదహృతాలిప్తా। కేంద్రేకర్కిమృగాదికే ।స్వర్ణలిప్తా గతిస్స్పష్టేగతిమాందకుజాదిషు॥

అ॥ మధ్యగతిని అగ్రహకేంద్రభుజజ్యాయొక్క అంతరముచాత గుణించి ౨౨౫ ట భాగించగా వచ్చినలబ్ధము తిరుగా ౧౦ ట గుణించి వారివారిఛేదముల చాత భాగిస్తేను లిప్తాదిగతిఫలమగును.

### సూక్ష్మస్ఫుటాధికారము.

ఆగతిఫలము కర్క్యాదిఅయితే మధ్యగతియందు ధనమున్ను మకరాదిఅయితే రుణమున్ను చేస్తేను మాందస్ఫుటగతియగును.

### శీఘ్రపరుధులు.

శ్లో॥ పంచా ౫ గ్ని 3 దశ ౧౦ లిప్తోనా । ద్విషయో ౫౨ ష్టశరా ౫౮ గ్రహాః । భౌమభార్గవసౌరిణాం । గుణాశ్శైఘ్రేబుధేజ్యయోః । తిథి ౧౫ రామ 3 కలాయుక్తాగుణకా భూగుణా 3౧। నృపాః ౧౬॥

అ॥ కుజునికి ౫౨ న్ను శుక్రునికి ౫౮ న్ని శనికి ౧౦ న్ని పంచాగ్ని శశిలిప్తోనంచేస్తేను కుజునికి స్ఫుటపరిధి ౫౧।౫౪ శుక్రునికి ౫౭।౫౭ శనికి ౯।౫౦ న్ని స్ఫుటపరిధియగును. బుధునికి 3౧ న్ని బృహస్పతికి ౧౬ న్ను తిథిరామకలాయుక్తా. అని బుధునికి 3౧।౧౫ న్ను బృహస్పతికి ౧౬।3 న్ను స్ఫుటపరిధి యగుచున్నది.

స్ఫుటశీఘ్రగుణకాలు॥ కుజునికి ౫౧।౫౫ బుధునికి 3౧।౧౫ బృహస్పతికి ౧౬।3 శుక్రునకు ౫౭।౫౭ శనికి ౯।౫౦. ఇవి స్ఫుటగుణకాలు.

### శీఘ్రసంస్కారక్రమము.

శ్లో॥ శీఘ్రోచ్చోద్ధ్యాగ్రహైః కేంద్రే - స్వదోర్జ్యానాంచకోటిజాం । గుణాభ్యస్తాంభజేత్త్రైభైః ౮౦ బాణాహుకోట్యోఫలే స్వకే - కోటిలబ్ధోనయుక్త్రిజ్యా - కేంద్రేకర్కిమృగాదికే తద్వర్గాదథదోర్లబ్ధవర్గయుక్తాత్పదంశ్రుతిః । త్రిజ్యాబా

హుఫలాభ్యస్తాస్వకర్ణాప్తాఫలజ్యకా । తద్ధనుస్స్వఫలం శై
ఘ్రం । కలాద్యం భూసుతాదిషు । స్వర్ణం తేన గ్రహాస్స్పష్టాః।
కేంద్రే మేష తులాదికే।

అ॥ గ్రహమును శీఘ్రములో శోధిస్తేను కేంద్రమనబను అ కేంద్రమువలన భుజకోట్లు సాధించి భుజజ్యను కోటిజ్యను సాధించేది. ఆభుజజ్య కోటిజ్యలను వారి వారి స్ఫుటగుణకములచాత గుణించి ౮౦ టు భాగించిన లబ్ధం భుజజ్యాఫలం కోటి జ్యాఫలము రాబడును. ఆకోటిజ్యాఫలము త్రిజ్యయందు కేంద్రము కర్క్యాది అయి తే కోటిజ్యాఫలము శోధించేది. మకరాది అయితే త్రిజ్యయందు కూడితే శుద్ధకోటి యగును. ఆశుద్ధకోటి వర్గమున్ను భుజాఫలవర్గమున్ను రెండుకూడి మూలంచే స్తేను వ్యాసయగును. అదే చలకర్ణ అని పేరుగలదు. భుజాఫలము త్రిజ్యచాత గుణించి చలకర్ణచాత భాగించగా వచ్చినఫలం ఫలజ్య అదే భుజాఫలం । ఆభు జాఫలము ౨౨౫ కి హెచ్చయినది మొదలుకొని ధనుస్సంస్కారం చేయవలెను. ఆభుజాఫలమును జాదిగ్రహములయందు మేషాది అయితే ధనమున్ను తులాదిఅయి తే ఋణమున్ను చేస్తేను స్ఫుటగ్రహాలగుదురు.

## సంస్కారక్రమము.

శ్లో॥ ఆదౌశైఘ్రదళం మాధ్యే - మాందార్ధం తు తతఃపరం
మాందం సర్వం గ్రహేమధ్యే - శీఘ్రం చేతి స్ఫుటగ్రహాః॥

అ॥ మొదటను శీఘ్రసంస్కారంచేసి అర్ధఫలమునున్ను సంస్కరించేది తి రుగా మాందసంస్కారంచేసి అర్ధఫలసంస్కారమున్ను తిరుగా మాందసంస్కా రంచేసి ఫలమంతయు మొదటిమధ్యగ్రహమందు సంస్కరించేది తర్వాత శీఘ్రసం స్కారంచేసి ఫలమంతయు సంస్కరిస్తేను స్ఫుటగ్రహములగుదురు.

## శీఘ్రస్ఫుటగతుల సాధనము.

శ్లో॥ త్రిజ్యాకర్ణస్తువిశ్లేషాగతౌ వ్యర్కవిశ్లేషసంగుణాత్ శీఘ్రకర్ణా
ద్ధృతం లిప్తాః కర్ణేత్రిజ్యాధికోనకే- స్వకర్ణాప్తాగతిస్స్వష్టాః
వక్రభుక్తిర్మహాద్రుణే॥

అ॥ మాందస్ఫుటగతిని శీఘ్రగతియందు శోధిస్తేను కేంద్రగతియగును. అ కేంద్రగతిని స్వకీయమైనటువంటి శీఘ్రకర్ణను త్రిజ్యలో పోవటమేగాని లేక



చలకర్ణలో త్రిజ్యను శోధించిన అంతరంచాతను గుణించి స్వకీయమైన శీఘ్ర చలకర్ణచాతను భాగించిన లిప్తాదికము శీఘ్రగతిఫలమగును. త్రిజ్య శీఘ్రకర్ణ కంటె అధికమగుచుండగా ధనఫలం శీఘ్రకర్ణత్రిజ్యకంటె అల్పముగుచుండగా ఋణఫలం ఆశీఘ్రఫలము మాందస్ఫుటగతియందు ధనరుణములుగు తేరిగి సంస్క రించతగినది అదె స్ఫుటగతి రుణశీఘ్రఫలము మందస్ఫుటగతిలో పోకపోయినప్పు డు రుణశీఘ్రఫలం అధికమయి ఆరుణశీఘ్రఫలంలో మందస్ఫుటభుక్తి పోయినను అది వక్రగతియగును.

యీప్రకారం స్ఫుటగ్రహం స్ఫుటగతి రాబడును.

| కుజాదుల ఓజయుగ్మమంద పరిధి భాగలు తెలియుచక్రం. | | | కుజాదులకు ఓజయుగ్మశీఘ్రపరిధిభాగలు తెలియజేయు చక్రం. | | |
|---|---|---|---|---|---|
| గ్రహముల యుగ్మమంద పరిధిభాగలు. | ఓజయుగ్మాంతరం. | గ్రహముల ఓజ మందపరిధి భాగలు. | కుజాదుల యుగ్మశీఘ్రపరిధి భాగలు. | కుజాదుల ఓజశీఘ్రపరిధిభాగాది. | ఓజయుగ్మాంతరభాగాది. |
| కు ౧౮ | ౪ భా | కు ౧ | కు ౫౧ | కు ౫౩ | ౨ భాగలు |
| బు ౫ | ౨ భా | బు ౩ | బు ౨౯ | బు ౩౧ | ౨ భాగలు |
| గు ౮ | ౧ భా | గు ౭ | గు ౧౫ | గు ౧౬ | ౧ భాగలు |
| శు ౨ | ౨ భా | శుక్ర ౪ | శు ౫౭ | శు ౫౯ | ౨ భాగలు |
| శ ౧౩ | ౪ భా | శని ౯ | శ ౮ | శ ౯ | ౧ భాగలు |
| ర ౩ | ౦ | | | | |
| చ ౭ | ౦ | | | | |

## ఈ ఆర్యభటశాస్త్రం.

మహాయుగాధిమాసాః ౧౫౯౩౩౩౬.
సూర్యమాసాలు ౫౧౮౪౦౦౦౦
యుగక్షయతిథులు ౨౫౦౮౨౫౮౦
చాంద్రకువాసరాలు ౧౬౦౩౦౦౦౦౮౦
మహాయుగభగణాలు ౪౩౨౦౦౦౦
చంద్రభగణాలు ౫౭౭౫౩౩౩౬
కుజభగణాలు ౨౨౯౬౮౨౪
బుధభగణాలు ౧౭౯౩౭౦౨౦

గురుభగణాలు ౩౬౪౨౨౪
శుక్రభగణాలు ౭౦౨౨౩౮౮
శనిభగణాలు ౧౪౬౫౬౪
రాహుభగణాలు ౨౩౨౨౨౬
చంద్రోచ్చభగణాలు ౪౮౮౨౧౯
సావనదినములు ౧౫౭౭౯౧౭౫౦౦
భూభగణాలు ౧౫౮౨౨౩౭౫౦౦
త్రిజ్యావర్గ ౧౧౮౧౯౮౪౪

## వక్రవక్రోదయాస్తస్థానసాధనం కేంద్రముచ్యతే.

శ్లో॥ స్ఫుటార్కేశీఘ్రఖేటంతు విశోధ్యస్ఫుటకేంద్రకం ఏతత్కేంద్రవశాత్సాధ్యం । వక్రవక్రోదయాస్తగాః॥

అ॥ కుజాదిపంచగ్రహములలోనే గ్రహముకు వక్రవక్రత్యాగాస్తోదయములు తెలియవలెనో ఆశీఘ్రస్ఫుటగ్రహమును స్ఫుటసూర్యునిలో శోధించగా నిలచినది స్ఫుటకేంద్రమనజను ఆస్ఫుటకేంద్రభాగలివలన ముందు సూచించుభాగలకు సమానరూపముగా తెలుసుకునేది.

| గ్రహములు. | వక్రారంభ భాగలు. | వక్రత్యాగ భాగలు. | పశ్చాదస్త భాగలు. | ప్రాగుదయ భాగలు. | ప్రాగస్త భాగలు. | పశ్చాదుదయ భాగలు. | [illegible] |
|---|---|---|---|---|---|---|---|
| కుజునికి | ౧౩౬ | ౨౨౩ | ౩౪౩ | ౧౬ | ౦ | ౦ | |
| బుధునికి | ౧౭ | ౩౪౨ | ౩౪౭ | ౧౨ | ౧౪ | ౩౪౬ | |
| గురునకు | ౧౧౫ | ౨౪౫ | ౩౪౯ | ౧౧ | ౦ | ౦ | |
| శుక్రునకు | ౨౯ | ౩౩౧ | ౩౫౨ | ౭ | ౧౦ | ౩౫౦ | |
| శనికి | ౧౦౯ | ౨౫౧ | ౩౪౫ | ౧౫ | ౦ | ౦ | |

వక్రమువక్రత్యాగముతప్ప కడమదంతాసరి.



## సూర్యచంద్రులకు సూక్ష్మస్ఫుటాధికారం.

శ్లో॥ గ్రహాఃస్వోచ్చోనితఃకేంద్రం । భుజరాశింఖవంహ్నిభిః సంగుణ్యాభాగసంయుక్తా । షడ్భక్తాజ్యారవిశ్శశి । జీవాంతరేణభాగాదిలిప్తీకృత్వాథసంగుణాత్ । చక్రాంశై ౩౬౦ ర్విభజేల్లబ్ధంయోజ్యంజ్యాపిండసాజ్ఞికే । ధనర్ణంమేషజూకాది పూర్వాపరఖగాంతరం స్ఫుటభుక్తావిజానియ్యాద్వత్స్యను ణప్రకారతః॥ మధ్యేర్వాల్పాస్ఫుటగతిః । రవివర్వక్రగతిర్భవేత్ । స్ఫుటగత్యాధికేమధ్యగతిః శీఘ్రగతిర్భవేత్॥

అ॥ గ్రహమును మాందోచ్చలో శోధించగా కేంద్రమనజను ఆకేంద్రమును భుజసాధించి రాశిభాగలుచేసి కిందిభాగలు కూడి ౬ట భాగిస్తె లబ్ధంజ్యాఖండపతకమగును ఆజ్యాపతకములయొక్క అంతరంచాతను శేష భాగాది లిప్తలు చేసి ఆఅంతరంచాతను గుణించి ౩౬౦ట భాగించినలబ్ధం జ్యాయందు కూడితేను అది భుజాఫలమగును ఆభుజాఫలము మేషాదికేంద్రమయిన ధనమున్ను తులాది కేంద్రమయిన రుణమున్ను చేసేది స్ఫుటగ్రహము పూర్వాపర గ్రహములయొక్క అంతరం స్ఫుటగతి అని తెలిసేది. మధ్యగతికంటె స్ఫుటగతి తక్కువయితే సూర్యచంద్రులకు వక్రగతిఅనిన్ని మధ్యగత్యాధిక్యమాయెనా శీఘ్రగతియనిన్ని సమానమాయెనా సమగతియనిన్ని త్రివిధములుగావుండెను.

## చాంద్రస్ఫుటము.

శ్లో॥ గ్రహస్వోచ్చోనితఃకేంద్రం । భుజరాశింఖవంహ్నిభిః । సంగుణ్యాభాగసంయుక్తాషడ్భక్తాజ్యాకుజాదిషు । పూర్వోక్తమాందకర్మేచ । సాధయేచ్ఛీఘ్రకర్మణే । కేంద్రేకక్ష్యేవ్యగాదాతు । జ్యాపిండాగతసాజ్ఞికే । జీవాంతరేణభాగాదిలిప్తీకృత్వాథసంగుణాత్ । చక్రాంశైర్విభజేల్లబ్ధంయోజ్యంజ్యాపిండసాజ్ఞికే । మాందార్ధంమధ్యమేకుర్యా - తదాశీ

ఘూర్ధమేవచ । మధ్యగ్రహేమందఫలం సకలంశీఘ్రమేవచ।
పూర్వోక్తమేవసంస్కుర్యాత్ । ఆర్యభట్టార్యసమ్మతం॥

అ॥ కుజాదులకు మొదట మాందోచ్చసంస్కారము సూర్య చంద్రులవలెనే చేసి రెండవపర్యాయము శీఘ్ర కేంద్రము సాధించి ఆ కేంద్రము కర్కాదిమకరాదిగా తెలుసుకొని కర్కాదిఅయితే కర్కాదిజ్యావతకమును మకరాది అయితే మకరాదిజ్యావతకమును పెట్టుకొని కడమకనిఅంతా మాందసంస్కారప్రకారమే చేసి పూర్వక్రమమున సంస్కారంచేసినను కుజాదులు స్ఫుటమగుదురు. బుధ శుక్రలకు శీఘ్రము మొదలుగానే నాల్గుసంస్కారములుచేసేది.

## కుజాదుల స్ఫుటగతులసాధనము.

శ్లో॥ తృతీయ్యకర్మజ్యాపిండే । అంతరేమధ్యభుక్తిషు గుణాచ్చక్రాంశకాలబ్ధం కేంద్రేకర్కిమృగాదికే । ధనర్ణంస్యాన్మందగతిశ్శీఘ్రగత్యూనకేంద్రజం । శీఘ్రజ్యాంతరజాభ్యస్తంభగణాంశైర్విభాజితంమందభుక్తౌధనర్ణంస్యాస్ఫుటగత్యాః కుజాదిషు । యథాఫలకలాదిభ్యో శుద్ధామందగతిర్యదితదా వక్రగతిస్తస్యా గ్రహస్యభవతి ధృవం॥

అ॥ మూడవకర్మజ్యాంతరంచాతను గ్రహములయొక్క మధ్యగతినిగుణించి ౩౬౦ టు భాగించిన లబ్ధం అస్వగతియందు కర్కాది మకరాదిని గుతేణరిగి మధ్యగతియందు సంస్కరించిన మాందగ్రహగతి ఆగతిని శీఘ్రగతియందు శోధిస్తేను కేంద్రగతియగును దానిని శీఘ్రజ్యాంతరంచాత గుణించి ౩౬౦ టు భాగించినలబ్ధము ధనాంతరమయితే మాందగతియందు కూడేది. కర్కాదికేంద్రమయితేనరుణాంతరముగనుక శోధించేది శీఘ్రగతియగును లేక శీఘ్రఫలంలో మాందగతి పోయినను వక్రగతియగును.

సంపూర్ణము.

---



| సూర్యజ్యా. | చంద్రజ్యా. |
|---|---|
| ౧ ప ౧౩ అ ౧౪ | ౧ ప ౩౧ అ ౩౨ |
| ౨ ప ౨౭ అ ౧౩ | ౨ ప ౬౩ అ ౩౦ |
| ౩ ప ౪౦ అ ౧౨ | ౩ ప ౯౩ అ ౨౯ |
| ౪ ప ౫౨ అ ౧౨ | ౪ ప ౧౨౨ అ ౨౮ |
| ౫ ప ౬౪ అ ౧౨ | ౫ ప ౧౫౦ అ ౨౬ |
| ౬ జ ౭౬ అ ౧౦ | ౬ ప ౧౭౬ అ ౨౫ |
| ౭ ప ౮౬ అ ౧౦ | ౭ ప ౨౦౧ అ ౨౩ |
| ౮ ప ౯౬ అ ౮ | ౮ ప ౨౨౪ అ ౧౯ |
| ౯ ప ౧౦౪ అ ౮ | ౯ ప ౨౪౩ అ ౧౮ |
| ౧౦ ప ౧౧౨ అ ౬ | ౧౦ ప ౨౬౧ అ ౧౪ |
| ౧౧ ప ౧౧౮ అ ౫ | ౧౧ ప ౨౭౫ అ ౧౨ |
| ౧౨ ప ౧౨౩ అ ౩ | ౧౨ ప ౨౯౭ అ ౭ |
| ౧౩ ప ౧౨౬ అ ౨ | ౧౩ ప ౨౯౪ అ ౫ |
| ౧౪ ప ౧౨౧ అ ౧ | ౧౪ ప ౨౯౯ అ ౨ |
| ౧౫ ప ౧౨౯ అ ౦ | ౧౫ ప ౩౦౧ అ ౦ |

| కుజమందజ్యా | కుజస్యమకరజ్యా | కుజజ్యకరిజ్యా. |
|---|---|---|
| ౧।౬౮ | ౧।౧౪౩ | ౧।౬౮౦ |
| ౨।౧౩౩ | ౨।౨౮౫ | ౨।౧౨౫౬ |
| ౩।౨౦౦ | ౩।౪౨౬ | ౩।౧౬౯౭ |
| ౪।౨౬౬ | ౪।౫౬౬ | ౪।౨౦౦౧ |
| ౫।౩౩౦ | ౫।౭౦౬ | ౫।౨౨౦౧ |
| ౬।౩౯౨ | ౬।౮౪౩ | ౬।౨౩౨౮ |
| ౭।౪౫౨ | ౭।౯౭౮ | ౭।౨౩౫౮ |
| ౮।౫౦౭ | ౮।౧౧౧౩ | ౮।౨౪౧౪ |
| ౯।౫౫౭ | ౯।౧౨౪౫ | ౯।౨౪౦౧ |
| ౧౦।౬౦౧ | ౧౦।౧౩౭౨ | ౧౦।౨౩౬౪ |
| ౧౧।౬౩౯ | ౧౧।౧౪౯౮ | ౧౧।౨౩౦౮ |
| ౧౨।౬౬౯ | ౧౨।౧౬౨౨ | ౧౨।౨౨౩౭ |
| ౧౩।౬౮౯ | ౧౩।౧౭౩౮ | ౧౩।౨౧౫౪ |
| ౧౪।౭౦౪ | ౧౪।౧౮౫౧ | ౧౪।౨౦౫౯ |
| ౧౫।౭౦౭ | ౧౫।౧౯౫౮ | ౧౫।౧౯౫౮ |

| బుధమందజ్యా. | బుధమకరజ్యా. | బుధకర్కిజ్యా. | గురుమందజ్యా. | గురుమకరజ్యా. | గురుకర్కిజ్యా. |
|---|---|---|---|---|---|
| ౧ ౨౩ | ౧ ౧౦౧ | ౧ ౨౨౩ | ౧ ౩౨ | ౧ ౫౯ | ౧ ౮౯ |
| ౨ ౪౬ | ౨ ౧౯౯ | ౨ ౪౩౫ | ౨ ౬౪ | ౨ ౧౧౮ | ౨ ౧౭౫ |
| ౩ ౬౯ | ౩ ౨౯౬ | ౩ ౬౨౪ | ౩ ౯౬ | ౩ ౧౭౬ | ౩ ౨౫౬ |
| ౪ ౯౦ | ౪ ౩౯౦ | ౪ ౭౯౧ | ౪ ౧౨౭ | ౪ ౨౩౧ | ౪ ౩౩౦ |
| ౫ ౧౧౦ | ౫ ౪౮౩ | ౫ ౯౩౧ | ౫ ౧౫౮ | ౫ ౨౮౪ | ౫ ౩౯౮ |
| ౬ ౧౨౯ | ౬ ౫౭౪ | ౬ ౧౦౪౪ | ౬ ౧౮౭ | ౬ ౩౩౫ | ౬ ౪౫౮ |
| ౭ ౧౪౬ | ౭ ౬౬౦ | ౭ ౧౧౩౪ | ౭ ౨౧౫ | ౭ ౩౮౪ | ౭ ౫౧౦ |
| ౮ ౧౬౨ | ౮ ౭౪౪ | ౮ ౧౨౦౦ | ౮ ౨౪౨ | ౮ ౪౨౯ | ౮ ౫౫౩ |
| ౯ ౧౭౫ | ౯ ౮౨౪ | ౯ ౧౨౪౫ | ౯ ౨౬౫ | ౯ ౪౭౨ | ౯ ౫౮౯ |
| ౧౦ ౧౮౭ | ౧౦ ౯౦౦ | ౧౦ ౧౨౭౪ | ౧౦ ౨౮౫ | ౧౦ ౫౧౧ | ౧౦ ౬౧౫ |
| ౧౧ ౧౯౮ | ౧౧ ౯౭౧ | ౧౧ ౧౨౮౩ | ౧౧ ౩౦౩ | ౧౧ ౫౪౬ | ౧౧ ౬౩౪ |
| ౧౨ ౨౦౫ | ౧౨ ౧౦౩౩ | ౧౨ ౧౨౭౬ | ౧౨ ౩౧౬ | ౧౨ ౫౭౬ | ౧౨ ౬౪౬ |
| ౧౩ ౨౧౦ | ౧౩ ౧౦౯౭ | ౧౩ ౧౨౬౨ | ౧౩ ౩౨౬ | ౧౩ ౬౦౧ | ౧౩ ౬౪౯ |
| ౧౪ ౨౧౪ | ౧౪ ౧౧౫౦ | ౧౪ ౧౨౩౩ | ౧౪ ౩౩౧ | ౧౪ ౬౨౧ | ౧౪ ౬౪౬ |
| ౧౫ ౨౧౫ | ౧౫ ౧౧౯౭ | ౧౫ ౧౧౯౭ | ౧౫ ౩౩౩ | ౧౫ ౬౩౭ | ౧౫ ౬౩౭ |

| శుక్రమాందజ్య. | శుక్రమకరజ్య. | శుక్రకటకజ్య. | శనిమాందజ్య. | శనిమకరజ్య. | శనికటకజ్య. |
|---|---|---|---|---|---|
| ౧ ౧౯ | ౧ ౧౫౨ | ౧ ౯౨౭ | ౧ ౪౩ | ౧ ౩౮ | ౧ ౪౮ |
| ౨ ౩౩ | ౨ ౩౦౩ | ౨ ౧౬౫౭ | ౨ ౮౫ | ౨ ౭౫ | ౨ ౯౫ |
| ౩ ౪౪ | ౩ ౪౫౪ | ౩ ౨౧౬౨ | ౩ ౧౨౭ | ౩ ౧౧౨ | ౩ ౧౩౯ |
| ౪ ౫౩ | ౪ ౬౦౪ | ౪ ౨౪౬౬ | ౪ ౧౬౮ | ౪ ౧౪౭ | ౪ ౧౮౧ |
| ౫ ౬౦ | ౫ ౭౫౩ | ౫ ౨౬౪౫ | ౫ ౨౦౭ | ౫ ౧౮౧ | ౫ ౨౨౧ |
| ౬ ౬౬ | ౬ ౯౦౧ | ౬ ౨౭౫౩ | ౬ ౨౪౪ | ౬ ౨౧౨ | ౬ ౨౫౫ |
| ౭ ౭౧ | ౭ ౧౦౪౯ | ౭ ౨౭౮౩ | ౭ ౨౭౮ | ౭ ౨౪౩ | ౭ ౨౭౮ |
| ౮ ౭౫ | ౮ ౧౧౯౭ | ౮ ౨౭౮౮ | ౮ ౩౦౯ | ౮ ౨౭౦ | ౮ ౩౧౩ |
| ౯ ౭౮ | ౯ ౧౩౪౦ | ౯ ౨౭౩౪ | ౯ ౩౩౭ | ౯ ౨౯౫ | ౯ ౩౩౭ |
| ౧౦ ౮౧ | ౧౦ ౧౪౮౩ | ౧౦ ౨౬౬౭ | ౧౦ ౩౬౨ | ౧౦ ౩౧౫ | ౧౦ ౩౫౫ |
| ౧౧ ౮౩ | ౧౧ ౧౬౨౩ | ౧౧ ౨౫౭౯ | ౧౧ ౩౮౩ | ౧౧ ౩౫౫ | ౧౧ ౩౭౦ |
| ౧౨ ౮౪ | ౧౨ ౧౭౬౧ | ౧౨ ౨౪౮౩ | ౧౨ ౩౯౮ | ౧౨ ౩౫౪ | ౧౨ ౩౮౦ |
| ౧౩ ౮౫ | ౧౩ ౧౮౯౩ | ౧౩ ౨౪౬౩ | ౧౩ ౪౧౦ | ౧౩ ౩౬౮ | ౧౩ ౩౮౬ |
| ౧౪ ౮౫ | ౧౪ ౨౦౨౪ | ౧౪ ౨౧౮౯ | ౧౪ ౪౧౭ | ౧౪ ౩౭౮ | ౧౪ ౩౮౭ |
| ౧౫ ౮౬ | ౧౫ ౨౧౫౦ | ౧౫ ౧౯౫౮ | ౧౫ ౪౨౦ | ౧౫ ౩౮౫ | ౧౫ ౩౮౫ |

## కల్ప్యాదిద్యుగణసాధనము దృక్సిద్ధముకు.

శ్లో॥ కల్యబ్దార్క ౧౨ గుణోమాసయుక్తత్రిస్థా

యీ శ్లోకార్థము పూర్వమే వ్రాసియున్నాను.

## మధ్యగ్రహసాధనము.

శ్లో॥ ఏకాదిస్థానసంఖ్యానాపదకానామహర్గణే। సంయోజ్యాన్మధ్యఖేటస్స్యాత్। పూర్వధ్రువసమన్వితః॥

అ॥ అహర్గణమందు ఏకాదిస్థానసంఖ్యలుగల ఆయాగ్రహగతులను సంకలనజన్యఫలకములు కూడి పూర్వధ్రువమును కూడగా మధ్యగ్రహలగును. దేశాంతర సంస్కారంచేశేది.

## పూర్వధ్రువములు.

శివగోత్ర్యభ్రరామాభ్రగుణాస్సూర్యధ్రువస్మృతః ౧౧।౭౯। 30।3౦

రుద్రాశ్వి ఖకరాష్వేద కరాశ్శూన్యాబ్ధ యశ్శశేః ౧౧।౨3। ౨౪।౪౦

రుద్రారసాశ్చరవయో నాగచంద్రాశ్చ భూభువః ౧౧।౬। ౧౨।౧౫

దశార్కనేత్రాబ్ధయశ్చదంతాస్స్యాంమ్యస్యశీఘ్రకే ౧౦।౧౨। ౪౨।3౨

ఖంశరాఃగజ రామాశ్చద్వ్యగ్నయస్తు గురోఃధ్రువః ౦।౫। 3౫।3౫

అభ్రభంనఖాశ్చ వేదాశ్చ షడ్వేదా భార్గవస్యహి ౦।౩౦। ౪।౪౬

దిశోతారాశూన్యకరాః కాష్టాధ్రువశసన్మృతాః ౧౦।౨౭ ౨౦।౧౦



ద్వ్యగోక్షిణేచదేశాశ్చ దేవాస్తుంగ శశేఃధ్రువం ౨।౩౯। ౫౬।33

షట్శూన్యమేకంద్విశరాః రాహోస్వధ్రువశోధితః॥ ౬।౦। ౧।౫౨

అ॥ సూర్యాదిగ్రహములకు అందరికి పూర్వధ్రువములు కూడేది రాహువు మాత్రం పూర్వధ్రువములో శోధించేది.

## సూర్యసాధనము.

శ్లో॥ అహర్గణఃఖాద్రి ౭౦ హృతేనవర్జితః ఖరాంశురంశాదిరయంప్రజాయతే। అహర్గణాలోచన ౨ సంగుణాచ్ఛరైః ౫ హృతాద్విలిప్తాదిఫలేనవర్జితః॥

అ॥ అహర్గణమును ౭౦ ట భాగించగా రాబడిన భాగాది అహర్గణములో శోధించేది తిరుగా అహర్గణమును ౨ ట గుణించి ౫ ట భాగించిన విలిప్తలు శోధించేది పూర్వధ్రువసంస్కారం దేశాంతరసంస్కారంచేశేది.

## చంద్రసాధనము.

శ్లో॥ గుణాహతోద్వ్యద్యుగణాద్వినాగై ౮౨ హృతశ్చచక్రాదిరయంప్రజాయతే। వేదాగ్నిబాణాప్తఫలాంశయుక్తపూర్వధ్రువాఢ్యశ్చనిశాకరస్స్యాత్॥

అ॥ ద్యుగణం 3 ట గుణించి రెండుప్రతులుగా వుంచి పై ప్రతిని [illegible] ట భాగించిన భగణాదిగ్రహమందు రెండోప్రతిని ౫3౪ ట భాగించిన భాగించిన భాగాదికూడేది పూర్వధ్రువదేశాంతరసంస్కారం చేశేది.

## త్రిగుణాబ్దసంస్కారము.

శ్లో॥ త్రిగుణాబ్దాద్వితర్కాక్షి ౨౬౨ హృతాలిప్తోనితోరవిః। ఖాగ్నిదేవ 333౦ హృతాలిప్తోయుతసంస్కృతచంద్రమాః॥

అ॥ త్రిగుణాబ్దాలు సూర్యునకు ౨౬౨ ట భాగించిన లిప్తాది రుణమున్నూ చంద్రునకు 333౦ ట భాగించిన లిప్తాదిధనము చంద్రోచ్చరాహువులను పూర్వమే సులభముగా చెప్పితిని.

శ్లో॥ అగజాననపద్మార్కం । గజాననమహర్నిశం । అనేకదంతం భక్తానా । మేకదంతముపాస్మహే॥

సూర్యచంద్రగ్రహాణాం మూలకు గణకరంజని ప్రథమాధికారమధ్యగ్రహములను చెప్పబోవు ప్రకారం దృక్సిద్ధం ఛాయవలయును రాహుకుమాత్రం త్రిగుణాబ్ధ సంస్కారశోధిత రాహుయందు సంస్కారం.

బీజాధికారము.

శ్లో॥ శశిచక్ష్వద్రిరూపోన ౧౭౨౧ శకాబ్దాంఖాద్రి ౭౦ సంహతాత్ అష్టాంబరేషు ౫౦౮ హృల్లబ్ధం కలికాదిరవిర్ధనం॥

అ॥ శాలివాహన శకగతసంవత్సరములలో ౧౭౨౧ శోధించి శేషమును ౭౦ టి చాత గుణించి ౫౦౮ ట భాగించగా రాబడిన కలాదిఫలము సూర్యుని యందు ధనంచేశేది.

శ్లో॥ అద్రిరూపాష్టరూపోన ౧౮౧౭ శకాబ్దాన్ ఖాగ్ని ౩౦ సంగుణాత్ । షణ్ణేత్రాక్షి ౨౨౬ హృతాల్లబ్ధం । కలికాద్యంవిధోర్ధనం॥

అ॥ శాలివాహనశకగతసంవత్సరములలో ౧౮౧౭ శోధించిన శేషము ౩౦ టు గుణించి ౨౨౬ ట భాగించిన కలాదిఫలము చంద్రునికి ధనం.

శ్లో॥ నప్తాంకాంకో ౯౯౭ శకైర్యూనా శేషాదష్టాదశై ౧౮ గుణాత్ ఖభాణ ౫౦ భక్త లిప్తాద్యం చంద్రతుంగం విశోధయేత్ ॥

అ॥ శాలివాహనశకగత సంవత్సరములయందు ౯౯౭ శోధించిన శేషమును ౧౮ టు గుణించి ౫౦ ట భాగించగా రాబడిన కలాదిఫలము చంద్రోచ్చలో శోధించేది.

శ్లో॥ నేత్రాగ్నిమునిభీ ౭౩౨ ర్యూనశకాబ్దాత్ ఖాష ౮౦ సంగుణాత్ । తిథివేద ౪౧౫ హృతాల్లబ్ధం । కలాద్యంశోధయేత్తమః॥



అ॥ శాలివాహనశకగతసంవత్సరములలో ౭౩౨ శోధించిన శేషమును ౮౦ చాత గుణించి ౪౧౫ ట భాగించగా రాబడిన కలాదిఫలము శోధించితేను రాహుస్ఫుగు.

శ్లో॥ ద్విసహస్రాధికశకం । సబీజంతదవాప్యతేవ్యత్సయేన్నై నసంస్కార్యా । సబీజఫలమత్సుతే॥ అర్థంస్పష్టం.

సూర్యచంద్రస్ఫుటం.

రవ్యుదయావికలాసంస్కారక్రమం.

శ్లో॥ దృక్సిద్ధార్కాంశదశభి ౧౦ ర్భక్తాల్లబ్ధం భవేత్తధాగత ఖండాంతరహతం । శేషందశహృతంఫలంగతఖండేర్ధనర్ణం స్యాద్విలిపాత్మకఖండకం॥

అ॥ బీజఫలమధ్యసూర్యునియొక్క భాగలను ౧౦ ట పాలుగొన్నలబ్ధము ను పరిమాణయిన యాదిగువను వ్రాయబడిన పతకము యొక్కవికలలను వ్రాసుకొనేది. భాగాదిశేషమును ఆఖండము యొక్కనున్ను పైఖండంయొక్కనున్ను అంతరముచేత గుణించి ౧౦ ట భాగించగా రాబడిన వికలలను పైన వ్రాయబడిన పతక వికలలయందు ధనరుణములు గుర్తెరిగి సంస్కరించేది అనగా వృద్ధి పతకముల యందు ధనమున్ను క్షయపతకములయందు రుణమున్ను ధనరుణ ధనక్షయాని కాదాని అనిన్యాయము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧౪|౯ | ధ ౪ | ౭|౪ | ధ ౬ | ౧౩|౯ | రు ౯ |
| ౨|౧౦ | ధ ౧ | ౯|౧౧ | ధ ౩ | ౧౪|౧౦ | ధ ౧౧ |
| ౩|౧౧ | ధ ౨ | ౯|౧౪ | ధ ౨ | ౧౫|౧౨ | ధ ౯ |
| ౪|౧౩ | ధ ౬ | ౧౦|౧౫ | రు ౧ | ౧౬|౨౦ | ధ ౯ |
| ౫|౭ | రు ౬ | ౧౧|౧౪ | రు ౩ | ౧౭|౨౯ | ధ ౬ |
| ౬|౦ | రు ౪ | ౧౨|౧౨ | రు ౩ | ౧౮|౩౪ | ధ ౫ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧౯\|౪౦ | ధ ౨ | ౨౫\|౦ | ధ ౧౨ | ౩౧\|౩౫ | రు ౫ |
| ౨౦\|౪౨ | రు ౨ | ౨౬\|౧౨ | ధ ౧౦ | ౩౨\|౩౦ | రు ౬ |
| ౨౧\|౪౦ | రు ౭ | ౨౮\|౨౨ | ధ ౧౦ | ౩౩\|౨౫ | రు ౮ |
| ౨౨\|౩౪ | రు ౭ | ౨౭\|౩౨ | ధ ౪ | ౩౪\|౧౬ | రు ౮ |
| ౨౩\|౨౮ | రు ౧౩ | ౨౯\|౩౫ | ధ ౨ | ౩౫\|౮ | రు ౮ |
| ౨౪\|౧౫ | రు ౧౪ | ౩౦\|౩౮ | రు ౧౪ | ౩౬\|౦ | రు ౦ |

## వికలాసంస్కారము.

శ్లో॥ అర్కోదద్యోస్తువికలా। గుణితామధ్యభుక్తయః। షష్టి ౬౦ భక్తాస్తువికలా। ధనర్ణంమధ్యఖేటయోః॥

శ్లో॥ ఖాదిశూన్యాంగ ౬౦ పర్యంతంభాగాది రుణసంజ్ఞికాః। తథా దిఖేంద్ర ౧౪౦ పర్యంతం ధనభాగాదిసంజ్ఞకాః। తథాఖ తత్వ ౨౫౦ పర్యంతం రుణభాగాది సంజ్ఞకాః తథాషట్వ గ్ని ౩౬౦ పర్యంతం ధనభాగాది సంజ్ఞకాః॥

అ॥ మధ్యసూర్యోదయానంతరముకాని పూర్వముకాని స్ఫుటసూర్యోదయముకలుగుట కలదు కాన నారెంటియొక్క అంతర వికలలను ఆయా గ్రహముల యొక్క మధ్యగతులచాత గుణించి ౬౦ట భాగించగా రాబడిన వికలలును పై మధ్యసూర్యునినే కేంద్రముగా నెంచుకొని ౬౦ భాగలవరకు రుణమనియును ఆది మొదలు ౧౪౦ భాగలవరకు ధనమనియును ౨౫౦ భాగలవరకు రుణమనియును ౩౬౦ భాగలవరకు ధనమనియును తెలియుము. యీసంస్కారము అన్నిగ్రహములకు ఆవశ్యకమవుటవల్లను ముందు సూర్యగ్రహణములోను యీసంస్కారం ముఖ్యమగుటవల్ల సూచించినాను.



## సూర్యభుజాఫలసాధనము.

ఆర్యభటసంమత స్ఫుటాధ్యాయమందు సూర్య చంద్రులకు ౩౦ జ్యాపతకాలు సాధించియున్నాను ఆపతకములవలన భుజాఫలము సాధించి స్ఫుటముచేయవలయును.

## భుజాఫలజనిత ప్రథమసంస్కారము.

శ్లో॥ సూర్యబాహుఫలాద్విస్థా। స్థిధి ౧౫ ఘ్నాద్విస్థిధి ౧౫౪ హృతాః। మునిసప్త ౭౭ హృతాల్లబ్ధం। చంద్రేవ్యత్యయమేవచ। తుంగేతురవివత్కార్య మాద్య సంస్కార ఈదృశః॥

అ॥ సూర్యభుజాఫలలిప్తలను ౧౫ ట గుణించి రెండు ప్రతులుగా వుంచి ౧౫౪ ట భాగించిన కలాదిఫలము చంద్రునియందు సూర్యునిలో చేర్చిన రుణమున్ను సూర్యునియందు రుణంచేసిన ధనమున్ను చేశేది.

౧౫ ట గుణించిన రెండోప్రతిని ౭౭ ట భాగించగా రాబడిన కలాదిఫలము చంద్రోచ్చయందు సూర్యునివలెనే సంస్కరించేది.

## ద్వితీయసంస్కారము.

శ్లో॥ తత్తుంగహీనంచంద్రం స్యాత్కేంద్రంవ్యర్కేందుసాధితం వ్యర్కేందుద్విగుణీకృత్య। చంద్రకేంద్రోనకేంద్రజందశభి ౧౦ భాజితఫలంగతఖండాభవంతిచ। ఖండాంతరేణభాగాదిహాత్వాదశ ౧౦ హృతాత్ఫలం। ఖండేయోజ్యంధనర్ణం స్యాత్తౌళిమేషాదిగేసతి। తత్కేంద్రాన్నందజఫలంసంస్కృత్యా తూర్వవత్సదా॥

అ॥ ప్రథమసంస్కారచంద్రునియందు తుంగమును శోధిస్తేను కేంద్రమవును వ్యర్కేందును సాధించి ద్విగుణించగా ద్విగుణితవ్యర్కేందనజను దానియందుచంద్రకేంద్రమును శోధించగా స్ఫుటకేంద్రమగును. ఆకేంద్రమును భుజసాధించి ౧౦ ట భాగించగా లబ్ధసంఖ్యకు తగినఖండమును పెట్టుకొని ఆ ఖండాంతరముచేత భాగాదిని గుణించి కిందిప్రతులు మానమెత్తి శేషగస్థానమును ౧౦ ట భాగించగా లబ్ధంఖండములోకూడి అఖండలిప్తాదిని తులాదిమేషాది కేంద్రమెరిగి ధనరుణములు కేంద్రములోచేశేది.

ఆ కేంద్రమువలన ౩౮ జ్యాపతకములవల్ల భుజాఫలం సాధించి పూర్వోక్త ప్రకారము మేషాదిఋణం తులాది ధనమని సంస్కరించేది మూండవ స్ఫుట చంద్రుడగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౦।౦।౦ | అ ౧౪ | ౩౦।౪౦।౦ | అ ౧౦ | ౬౦।౬౯।౦ | అ ౬ |
| ౧౨।౧౪।౦ | అ ౧౩ | ౪౦।౫౮।౧ | అ ౧౦ | ౭౦।౭౫।౦ | అ [illegible] |
| | | | | ౮౧।౭౮।౦ | అ ౨ |
| ౨౦।౨౭।౦ | అ ౧౩ | ౫౦।౬౦।౦ | అ ౯ | ౯౦।౮౦।౦ | అ ౦ |

## మూడవసంస్కారము.

శ్లో॥ శూన్యాష్ట ౧౮౦ రూపలిప్తాంత మేకభాగకలాద్వయం। చంద్రార్కోనంభుజస్యార్ధ్యం మేషేర్ణంజూకగేధనం॥

అ॥ ౧౮౦ లిప్తలకు జ్యాసాధించబడియున్నది భాగ ౧ కి ౨ లిప్తల లెఖను చంద్రునిలో సూర్యునిశోధించిన కేంద్రమువలన భుజసాధించి ఆభుజభాగలకు భాగ ౧ కి ౨ లిప్తలలెఖను త్రైరాశికప్రకారం రాబడిన కలాదిఫలము అర్కోన చంద్రకేంద్రము మేషాదిఅయిన ఋణమున్ను తులాదిఅయిన ధనమున్ను చేసేది.

## ౪ వ సంస్కారము.

శ్లో॥ వ్యర్కేందుభాగాన్ ఖశరాబ్ధి ౪౫౦ భక్త్వా। లబ్ధ్యంతుఖండాంతరమేవగుణ్యంశేషస్త్వబ్ధిభక్తంగతఖండమేళనాత్ కలాఫలంకేంద్రమయుగ్మయుగ్మే। ధనంభవేదోజపదేచకేంద్రే యుగ్మేఋణానక్రకుళీరగేక్రమాత్॥

అ॥ వ్యర్కేందుభాగలను ౮ ట భాగించగా రాబడిన లబ్ధమును తగిన మకరాదికర్క్యాది తెలుసుకొని ఖండమును పెట్టుకొని ఖండాంతరముచేత భాగాదిని గుణించి లిప్తవిలిప్తలను ౬౦ ట భాగించి భాగస్థానమందు కూడి ౪౫౦ ట భాగించగా రాబడిన కలాదిఫలము గతఖండములో కూడిన కలాదిఫలము వ్యర్కేందుకేంద్రము ఓజపదమయిన ధనమున్ను యుగ్మపదమయిన చంద్రునియందు ఋణంచేయ తగినది.



| మకరాది. | | కర్క్యాది. | |
|---|---|---|---|
| ౧।౧౦ | ౭।౩౪ | ౧।౧౨ | ౭।౩౫ |
| ౨।౧౮ | ౮।౩౦ | ౨।౧౬ | ౮।౩౪ |
| ౩।౨౫ | ౯।౨౫ | ౩।౨౫ | ౯।౨౮ |
| ౪।౩౦ | ౧౦।౧౬ | ౪।౩౧ | ౧౦।౨౧ |
| ౫।౩౪ | ౧౧।౯ | ౫।౩౨ | ౧౧।౧౨ |
| ౬।౩౫ | ౧౨।౦ | ౬।౩౮ | ౧౨।౦ |

## పంచమసంస్కారము.

శ్లో॥ సూర్యబాహుకలాభ్యస్తా దశ ౧౦ శూన్యాగ్నిసోమ ౧౩౦ హృత్ కలాదికఫలంభానో। వ్యత్యయోస్తమసస్ఫుటం॥

అ॥ సూర్యభుజాఫలమును ౧౦ టు గుణించి ౧౩౦ ట భాగించగా రాబడిన కలాదిఫలము సూర్యభుజాఫలము ఋణమయిన ధనముగాను ధనమయిన ఋణముగాను రాహువులో సంస్కరించిన స్ఫుటరాహువగును.

## విక్షేపసాధనము.

శ్లో॥ పాతోనకేంద్రభుజభాగశరై ౫ ర్విభక్తా। విక్షేపయోఃపతకసంఖ్యముపైతిసామ్యే। శిష్టానిపశ్యాంతర నిఘ్నమర్ధై ౫ ర్విభాజయేదాప్తఫలంయుతాన్యు విక్షేపలిప్తామధమేషతులాదదక్షౌ॥

అ॥ చతుర్థఫలసంస్కృత చంద్రునియందు స్ఫుటరాహువును శోధించగా పాతోనకేంద్రమనబడును దీనిని భుజసాధించి ఆభుజభాగలను ౫ ట భాగించగా రాబడిన సంఖ్యకు సమానమయిన పతకం పెట్టుకొని ఆపతకాంతరంచాతను భాగాదిని గుణించి మానము త్రిభాగస్థానమందు కూడి భాగలను ౫ ట భాగించగా రాబడిన ఫలము పతకమందుకూడితేను మధ్యవిక్షేపలిప్తాదియగును ఆపాతోనకేంద్రము మేషాదిఉత్తరమున్ను తులాదిదక్షిణవిక్షేపమని తెలియవలయును.

## కుజాదుల ధృవసాధనము.

శ్లో॥ కల్యబ్దాత్షట్కృత్యోన ౩౬౦౦ శేషంశరహతైర్హృతం ఖభూ
నాగైః ౮౧౦ ఖషడ్వేదైః ౪౬౦ గగనాంబరషోడశైః
౧౬౦౦ శూన్యాబ్ధిపావకైః ౩౪౦ ఖాబ్ధివార్ధి ౪౪౦ భక్తంకలా
దికం గురోర్ధనంసదా కార్యమితరేషాంఋణంభవేత్॥

అ॥ కల్యాద్యబ్దాలలో ౩౬౦౦ శోధించిన శేషమును ౫ ట గుణించి కుజునకు ౮౧౦ బు ౪౬౦ గు ౧౬౦౦ శు ౩౪౦ శనికి ౪౪౦ యీహారములచేత భాగించగా రాబడిన కలాదిఫలము గురువుకు ధనమున్ను ఇతరులకు ఋణముచేయదగ్గది.

## మాందాలు.

శ్లో॥ ద్వ్యగేందుగజభూపార్ధా ౨|౧౭|౮|౪ సూర్యమాందధ్రువస్సదా
బాణాంకేందుశశాంకాగ్ని నవాంబుధిగురోర్ధ్రువః ౫|౧౯ ౩౧|౪౯
అష్టాంగ బాణబాహ్వభ్ర భాను సూర్యసుతస్యతు ౮|౬| ౫౨|౧౨

## మాందాలకుసంస్కారము.

శ్లో॥ భూలోచనాగ్ని ౧౩౨౧ చంద్రోనశాకాత్సూర్యస్య ఖాద్రి
భూః ౧౭౦ గురోర్వేదషట్ ౬౪ శాస్త్రషట్కైః ౬౬ గు
ణితాత్తుత్రైః ఋతుసప్త ౭౬ శూన్యాభ్రబాణా ౫౦౦
భ్రేషుభుజా ౨౫౦ ధృతాత్ కలాదికంఫలంయోజ్యం ముచ్చే
ర్వేజ్యకసౌరిణాం॥

అ॥ శాలివాహనశకములో ౧౩౨౧ శోధించిన శేషమును సూర్యునకు ౧౭౦ ట బృహస్పతికి ౬౪ ట శనికి ౬౬ ట గుణించి సూర్యునకు ౭౬ ట గురువుకు ౫౦౦ ట శనికి ౨౫౦ ట భాగించిన కలాదిఫలము మాందోచ్చములయందు కూడేది.

## అథపాతాః.

శ్లో॥ గీష్పతిలోచనాంకేందు నవాబ్ధి మనుసంజ్ఞితం ౨|౧౯|
౯|౧౪



శనేర్గుణాగ్నిదిక్పాలదంతాః ౩|౩|౮|౩౨ పాతస్యసంజ్ఞితం॥

## సంస్కారము.

శ్లో॥ భూలోచనాగ్నిచంద్రోన ౧౩౨౧ శాకాద్వాదశ ౧౨ సంగు
ణాత్। గురోశ్శూన్యనవైః ౯౦ మందస్యైకరామైః ౩౧ శ్చ
భాజితాః కలాదికఫలంశోధ్యంగురుమందయోశ్చపాతయోః॥

## మాందకర్ణసాధించుటకు క్రమము.

## అందుకు కోటిగుణకములు.

శ్లో॥ ఖఖాబ్ధిబాణచంద్రాఖ్య మంశాద్యంగుణకంరవేః ౦|౪౦|౧౫
చంద్రబాణేషుబాణేందు చాంశాద్యంగుణకంగురోః ౧౫|౫౫|
౧౫ బాహుబాణైకశూన్యాఖ్యమంశాద్యం గుణకంశనేస్తథా।
౧౫|౦ ఏతానికోటిగుణకాన్యంశాదిషుయథాక్రమం॥

## స్ఫుటకర్ణసాధనము.

శ్లో॥ కోటిజ్యాంగుణకైర్హన్యాత్। నఖైరాప్తంతుకోటిషు। ఫ
లార్ధంత్రిజ్యయాశోధ్యం కర్క్యాదౌ కేంద్రగేసతి। మకరా
దౌతుసంయోజ్యం। మాందకర్ణఇతిస్మృతః॥

అ॥ భుజజ్యాకోటిజ్యలను సాధించి కోటిజ్యలను వారివారి గుణకములచేత గుణించి ౨౦ ట భాగించగా రాబడిన ఫలము సగముచేసి త్రిజ్యయందు కర్కాటకాది కేంద్రమైన శోధించేది మకరాది కేంద్రమయిన కూడితేను మాందకర్ణమగును.

## స్పర్శరేఖజ్యాసాధనము.

శ్లో॥ భుజజ్యాత్రిజ్యయాభ్యస్తా కోటిజ్యాంచవిభాజితా స్పర్శరేఖాఫ
లంసాధ్యమిత్యుక్తంపూర్వసూరిభిః॥

అ॥ భుజజ్యను త్రిజ్యచేతగుణించి కోటిజ్యచేత పాలుగొన్నలబ్ధము స్పర్శరేఖజ్యాలు అవును.

## ప్రత్యక్షం.

౧౭ భాగభుజజ్య ౧౦౦౫ దీనిని త్రిజ్యయును ౩౪౩౮ ని గుణించగా ౩౪

౫౪౯|౦|౩౦ దీనిని కోటిజ్య ౭౩ జ్యాపతకముగు ౩౨౮౬|౩౨ ట భాగించగా స్పర్శరేఖజ్యా ౧౦౫౧|౬ రాబడెను.

స్పృగాధనువనగా స్పర్శరేఖజ్యాలు.

| | |
|---|---|
| ౧\|౬.౦\|అ౬౦\|౦ | ౧౧\|౬౬౮\|౧౮అ౬౫\|౨౪ |
| ౨\|౧౨౦\|౦అ౬౦\|౧౨ | ౧౨\|౬౩౦\|౪౨అ౬౨\|౫౪ |
| ౩\|౧౮౦\|౧ ౨అ౯౦\|౧౨ | ౧౩\|౬౯\|౩౬అ౩౬౩\|౩౦ |
| ౪.౨౪౦\|౨౪అ౬౦\|౨౪ | ౧౪\|౮౫౬\|౬అ౬౪\|౦ |
| ౫\|౩౦౦\|౪౮అ౬౦\|౩౬ | ౧౫\|౯౨౧\|౬అ౬౮\|౪౮ |
| ౬\|౩౬౧\|౨౪అ౬౦\|౪౨ | ౧౬\|౯౮౫\|౫౪అ౬౫\|౧౨ |
| ౭\|౪ ౨౨\|౬అ౬౧\|౬ | ౧౭\|౧౦౫౧\|౬అ౬౬\|౦ |
| ౮\|౪౮\|౩\|౧౨అ౬౧\|౨౪ | ౧౮\|౧౧౧౭\|౬౬\|౪౮ |
| ౯\|౫౪౪\|౩౬అ౬౧\|౩౬ | ౧౯\|౧౧౮౩\|౫౪అ౬౭\|౨౪ |
| ౧౦\|౬.౦౬\|౧౨అ౬౨\|౬ | ౨౦ ౧౨౫౧\|౧౮అ౬౮\|౧౨ |

యీజ్యాలకు సమానముయిన భుజాఫలమును శోధించి శేషమును అంతరమ్ము చాత గుణించి ౬౦ ట భాగించినఫలము పతకములో కూడితేను ధనుసంస్కారముగును.

## గురుశనుల స్ఫుటాధ్యాయం.

### మొదట మాందస్ఫుటం.

శ్లో॥ రవిభాదిగ్రహాణాంతు । సబీజంతు తతఃస్ఫుటం తన్మంథోచ్చ విహీనంతు కేంద్రేపదచతుష్టయం । భాగాస్తుషడ్వృతాల్లబ్ధం జ్యాపిండామాందకర్మణి ॥ శేషభాగాంతరగుణాషడ్వృతాః పిండసంయుతాః॥

అ॥ సూర్యాదిగ్రహములకు యావన్మందికి బీజసంస్కారం జేసి స్ఫుటము చాయవలయును గ్రహములో మందోచ్చను శోధించిన కేంద్రము ౪ పాదములు గలది ౬ రాసులలోగా అదే కేంద్రము ౬ రాసులకుపయిన ౧౨ రాసులలో శోధించిన కేంద్రమగును ఆకేంద్రమును భాగలుచేసి ౬ ట భాగించిన లబ్ధం జ్యాఖండమగును ఆజ్యాఖండంపెట్టుకొని ఆఖండాంతరంచేతను భాగాదిని గుణించి మానమెత్తి భాగస్థానమందు చేర్చి ౬ట్ల భాగించినలబ్ధము పదకమందుకూడి ఆఫలజ్యాను కేంద్రము మేషాదిఅయితే రుణమున్ను తులాదిఅయితే ధనమున్ను చాయవలయును మాందస్ఫుటమగు సూర్య చంద్ర గురు శనులకు జ్యాపతకాలు ముందుచూపి వున్నవి.



### సంస్కారం పాతోనకేంద్ర జనితఫలసాధనం.

శ్లో॥ పాతోనకేంద్రజనితఫలభాగాదశో ౧౦ ధృతాః । శేషంఖండాంతరహతం భాగాద్దశహృతాఃఫలం । సంయోజ్యఖండే పాతోనకేంద్రోయుగ్మపదేర్ధనం ఓజపాదేరుణం కార్యంసంస్కారేమాందకర్మణి॥

అ॥ మాందస్ఫుటగ్రహమును పెట్టుకొని పాతోనకేంద్రము భుజసాధించి ఆభుజను ౧౦ ట భాగించిన లబ్ధముకు సామ్యముయిన పతకమును పెట్టుకొని దాని అంతరంచాతను భాగాదిని గుణించి మానమెత్తి భాగస్థానమును ౧౦ ట భాగించిన లబ్ధము ఖండమందు కూడి ఆఫలము పాతోనకేంద్రము ఓజపదమందుండగా మాందసంస్కారగ్రహములో రుణమున్ను యుగ్మపదమందుండగా ధనంచేశేది. పాతోనకేంద్రము ౩ రాసులవరకు ఓజపదం ౬ రాసులవరకు యుగ్మ ౯ రాసులవరకు ఓజ ౧౨ రాసులవరకు యుగ్మ గురుశనులకు పాతోనకేంద్రఫలము తెలుపుపట్టి.

| గురునికిలిప్తాది. | శనికిలిప్తాది. |
|---|---|
| ౦\|౦\|౦ | ౦\|౦\|౦ |
| ౧౦\|౦\|౮ | ౧౦\|౦\|౩౧ |
| ౨౦\|౦\|౨౦ | ౨౦\|౧\|౨ |
| ౩౦\|౦\|౨౫ | ౩౦\|౧\|౨౫ |
| ౪౦\|౦\|౩౫ | ౪౦\|౧\|౩౭ |
| ౪౫\|౧\|౩౦ | ౪౫\|౧\|౩౭ |
| ౫౦\|౦\|౩౧ | ౫౦\|౧\|౩౫ |
| ౬౦\|౦\|౨౫ | ౬౦\|౧\|౨౫ |
| ౭౦\|౦\|౨౧ | ౭౦\|౧\|౯ |
| ౮౦\|౦\|౭ | ౮౦\|౦\|౩౨ |
| ౯౦\|౦\|౦ | ౯౦\|౦\|౦ |

౩ సంస్కారం గురుశనులయొక్క విశేష

సంస్కారక్రమము.

భుజగ్రహసాధనంబు.

శ్లో॥ నేత్రాష్టాబ్ధిశశి ౧౪౮౨ ర్యూనశాకే ద్విగుణితాహృతాః అం
గాగ్నిధృతి ౧౮౩౬ హృల్లబ్ధం భుజగ్రహోభగణాదికం॥

అ॥ శాలివాహనశకమునందు ౧౪౮౨ శోధించగా నిలచిన శేషమును రెంటు గుణించి ౧౮౩౬ కు భాగించగా రాబడినవి భగణాలు శేషం ౧౨ టు గుణించి ౧౮౩౬ కు భాగించిన రాసులు శేషం ౩౦ టు గుణించి ౧౮౩౬ కు భాగించిన లబ్ధం భాగలు ౬౦ టు గుణించి ౧౮౩౬ టు భాగించిన లబ్ధం లిప్తలు విలిప్తలు యీప్రకారం భుజగ్రహమును సంవత్సరాంతంవరకు పర్యాయము సాధించుకునేది యీభుజగ్రహముకు మార్పులేను, సంవత్సరం ౧ కి ౨౩ లిప్తల ౩౨ విలిప్తలుకూడితేను మరుందు సంవత్సరం భుజగ్రహమగును.

భుజగ్రహజనితఫలజ్యాసాధనము.

శ్లో॥ భుజగ్రహోభుజరాశ్యాది లిప్తీకృత్యహృతోవేద ౪౯౦ హృత్ల
భ్యంఖండాంతరంగుణ్యం భాగ్తువేద ౪౯౦ హృతాశిఫలంగ
తఖండేయుతంకార్యం కేంద్రేమేషతులాదిగే ధనర్ణంతుసు
రాచార్యో । మందేవ్యత్యయమేవచ॥

అ॥ భుజగ్రహరాశ్యాదిని భుజసాధించి ఆభుజను లిప్తలుచేసి ఆలిప్తలను ౪౯౦ టు భాగించిన లబ్ధమును లగిన గతఖండమును పెట్టుకొని శేషముఖండాంతరముచే గుణించి ౪౯౦ టు భాగించిన లబ్ధము ఖండములోకూడి ఆఫలము గురువుకు భుజగ్రహము మేషాదిఅయిన ధనంతులాదిఅయిన ఋణం శనికి భుజగ్రహము మేషాది అయిన ఋణం తులాదిఅయిన ధనం యీప్రకారము యీగురుశనులకు భుజగ్రహసంస్కారము చేయవలయును.



| గురువు భుజగ్రహజనితకలాది ఫలం ౨౧ | | శనిభుజగ్రహజనితకలాది ఫలం ౪౯ | |
|---|---|---|---|
| ౧౨\|౪౬ . | ౮\|౧౬\|౪౦ | ౧౬\|౨౬ | ౮\|౩౭\|౫౨ |
| ౨\|౫\|౨౭ | ౭\|౧౭\|౧౨ | ౨\|౧౨\|౪౨ | ౭\|౪౨\|౨౮ |
| ౩\|౭\|౪౪ | ౯\|౧౯\|౨౪ | ౩\|౧౭\|౪౬ | ౯\|౪౫\|౨౦ |
| ౪\|౧౦\|౩౨ | ౧౦\|౨౦\|౧౯ | ౪\|౨౪\|౩౨ | ౧౦\|౪౮\|౨౦ |
| ౫\|౧౨\|౪౮ | ౧౧\|౨౦\|౫౦ | ౫\|౨౯\|౫౨ | ౧౧\|౪౭\|౩౨ |
| ౬\|౧౪\|౫౨ | ౧౨\|౨౧\|౨ | ౬\|౩౪\|౪౦ | ౧౨\|౪౯\|౨ |

గురువుకు నాల్గు ఉపకరణములుకలవు

అందుకు సంస్కారక్రమము.

శ్లో॥ నేత్రాంకా ౯౨ మూర్ఛనా ౨౧ దింద్రా ౧౪ బాణాగ్నయ
౩౫ ధ్రువాణివై । గురూపకరణానాంతు సంస్కారప్రథ
మానివై॥

అ॥ గురువుకు నాల్గు ఉపకరణములుకలవు మొదటిది ౯౨ రెండవది ౨౧ మూడవది ౧౪ నాలుగవది ౩౫ ధ్రువసంఖ్యలు.

శ్లో॥ ఖాత్ర్యష్ట వేదశూన్యాష్ట చంద్రోన ౧౮౦౪౮౩౦ కలివాస
రాన్ మునిభిర్విభజేచ్ఛేషం గురువారాదికంభవేత్ ॥
శేషంశతేన ౧౦౦ గుణితంయుగబాణాక్షివర్జితే ౨౫౪ యు
గాబ్ధివార్ధిద్విశైలైః ౭౨౪౪౪ ఖాద్రివేదాప్త ౫౪౭౦
సంక్షిప్తేః । భాంకాగ్నివేద ౪౩౯౦ లబ్ధంతు । యుక్షోక్తవిధి

